BHARATHEEYA SAHITHYA VYASALU

Dr. Nalimela Bhaskar



ఇవి భారతీయ సాహిత్య వ్యాసాలు.
తెలుగు సాహిత్యంలో వ్యాసం,
విమర్శ, హాస్యం లాంటి ఎన్నెన్నో ప్రక్రియలు
నిష్క్రియలుగా మారుతున్న సమయంలో మేం
"రామయ్య విద్యా పీఠం"
తరపున డా॥ నలిమెల భాస్కర్
సమగ్ర సాహిత్య దర్శనం చేయించే
దిశలో కొంతలో కొంతయినా
ఉపయోగపడే వ్యాసాలు తీసుకొస్తున్నాం.
ఈ వ్యాసాల్లోని వైవిధ్యం తప్పకుండా
పాఠకుల్ని ఆకట్టుకొని
తమ వెంట తిప్పుకుంటుంది.

\- జూలూరు గౌరీశంకర్




# భారతీయ సాహిత్య వ్యాసాలు

## డా॥ నలిమెల భాస్కర్



**భారతీయ సాహిత్య వ్యాసాలు**

**నలిమెల భాస్కర్**

ప్రచురణ కాలం : 2010

© : రామయ్య విద్యాపీఠం

ప్రతులకు : రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో

**జూలూరు గౌరీశంకర్**
జర్నలిస్ట్, సంపాదకుడు,
1-8-702/33/20ఎ
పద్మాకాలనీ, నల్లకుంట,
హైదరాబాద్-500 044

వెల : **రు. 60/-**

కవర్ డిజైన్ : ఏలె లక్ష్మణ్

కంపోజింగ్ & పేజి లే అవుట్ : ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44
ఫోన్ : 27660000

ముద్రణ : కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
(మల్టీకలర్ ప్రింటర్స్ & డిజైనర్స్)
విద్యానగర్, హైదరాబాద్-44 ఫోన్ : 27618261

# ఒక విశాల గవాక్షం

ఇవి భారతీయ సాహిత్య వ్యాసాలు. తెలుగు సాహిత్యంలో వ్యాసం, విమర్శ, హాస్యం లాంటి ఎన్నెన్నో ప్రక్రియలు నిష్క్రియలుగా మారుతున్న సమయంలో మేం "రామయ్య విద్యా పీఠం" తరపున డా॥ నలిమెల భాస్కర్ సమగ్ర సాహిత్య దర్శనం చేయించే దిశలో కొంతలో కొంతయినా ఉపయోగపడే వ్యాసాలు తీసుకొస్తున్నాము. ఈ వ్యాసాల్లోని వైవిధ్యం తప్పకుండా పాఠకుల్ని ఆకట్టుకొని తమ వెంట తిప్పుకుంటుంది.

సుప్రసిద్ధ ప్రగతిశీల ఉర్దూ కవి అయిన ఫైజ్ మొదలుకొని ఇందులో ఇబ్రహీం జలీస్ రాసిన 'రెండు దేశాలు-కథ ఒక్కటే' వరకు పద్నాలుగు వ్యాసాలు ఉన్నాయి. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి మీద చాలా ఆసక్తికరమైన వ్యాసం వుంది.

నూరేళ్ళ తెలుగు కథ ఉత్పత్తి వికాసాల గురించి చదువుకుంటున్న ఈ తరుణంలో దాదాపు మనకన్నా ఇరవై ఏళ్ళ ముందే మలయాళ కథ ఆవిర్భవించిందన్న విషయం తెలుసుకోగలుగుతాం "నూరేళ్ళ మలయాళ కథ సాహిత్యం తీరు తెన్నులు" వ్యాసంలో. అలాగే "నూరేళ్ళ బెంగాలీ కథ" లోని రుచులన్నీ తెలుగు పాఠకులు ఆస్వాదిస్తారు.

మైనార్టీ ముస్లిముల మీద మెజార్టీ హిందువుల అభిప్రాయాలు ఎలా వుంటాయో "ఈ దేశంలో ముస్లిముల దుస్థితి" తెలియజేస్తుంది. ఇందులోని చేదు నిజాలు తెలిసీ మనలో చాలా మంది భుజాలు తడుముకుంటారు.

దాదాపు ఐదు దశాబ్దులుగా కేవలం కథా ప్రక్రియకే అంకితమై, సాహిత్య అకాడమీలాంటి ప్రభుత్వ సంస్థలు యిచ్చే అవార్డులేవీ స్వీకరించని మలయాళ రచయిత టి. పద్మనాభన్ వ్యాసం మనలో చాలా మందికి అవార్డుల పట్ల వున్న కెరీరిజం దూరం చేసినా చాలు.

తెలుగు సామెతల్లో జాతర చేసిన హాస్యం చదివి నవ్వుకోకుండా వుండలేం.

వందేళ్ళకు పైబడి బతికిన నిరాద్.సి. చౌదరి బెంగాలీలో రాసిన వ్యాసానికి అనువాదం ఉంది ఈ వ్యాసాల్లో.

విలువల గురించి తెగ బాధపడ్డట్లు నటిస్తున్న పత్రికారంగానికి, స్ఫూర్తిదాయక రచన "స్వామినాథ సదానందం" ఉంది. గాంధీ, పటేల్‌లాంటి వాళ్ళని సైతం పత్రికతో ఎదురించిన ధీరోదాత్తుడాయన.

తెలుగు, మలయాళ భాషల్లో ఆలుమగలకు సంబంధించిన సామెతలూ, తెలుగు తమిళాల్లో ఉన్న పొడుపు కథలూ విశ్లేషించి చూపే జానపదుల సాహిత్యమూ వుంది. మలయాళంలో స్త్రీవాద కథా సాహిత్యం ఎట్లా వుందో తెలిపే మరొక వ్యాసం ఈ సంపుటికి నిండుదనాన్ని ఇచ్చిందనుకుంటాను.

ఈ వ్యాస సంపుటికి కొసమెరుపు ఇబ్రహీం జలీస్ రచన "రెండు దేశాలు-కథ ఒకటే"! ఇది "చాలా ఆసక్తికరమైన రచన చదివి ఆశ్చర్యపోవడం మన వంతు అవుతుంది.

చదవండిక! భారతీయ సాహిత్య వ్యాసాల విశాల గవాక్షం తెరిచి కొత్త దృశ్యాలు దర్శించండి!! కొత్త రుచులు ఆస్వాదించండి!!

- జూలూరు గౌరీశంకర్

# విషయ సూచిక

# ఫైజ్ - జీవితమూ, రచనలు

**సు**ప్రసిద్ధ ప్రగతిశీల ఉర్దూ కవి అయిన ఫైజ్ అహ్మద్ ఫైజ్ 1911 లో సియాల్‌కోట్ (పాకిస్తాన్)లో జన్మించారు. ప్రాథమిక విద్యాభ్యాసం ఉర్దూ, ఫారసీ, అరబ్బీ భాషల్లో పూర్తి చేసుకుని ఆంగ్ల సాహిత్యంలోనూ, అరబ్బీలోనూ ఎం.ఏలు చేశారు. ఆ తర్వాత ఏడు కవితా సంపుటులు ప్రచురించారు. 1941లో నక్ష్-ఏ-ఫరియాదీ, 1952లో దస్త్-ఏ..సభా, 1956లో జిందానామా, 1964లో దస్త్-ఏ-తహ్-ఏ-సంగ్, 1971లో సర్-ఏ-వాదీ-ఏ-సేనా, 1978లో శామ్-ఏ-శహర్-ఏ-యారాఁ, 1980లో మేరే దిల్ మేరే ముసాఫిర్‌లు వెలువరించారు. ఫైజ్ ఆంగ్లంలో ప్రొఫెసర్‌గా పనిచేయడమే కాకుండా అనేక పత్రికలకు సంపాదకత్వ బాధ్యతను చేపట్టారు. పాకిస్తానీ సినిమాలకు పాటలు కూడా రాశారు. కవిత్వంతోపాటు ఫైజ్ చేసిన గద్య రచనలివి : మీజాన్ (వ్యాస సంపుటి-1963), సలీబేఁమేరే దరీచే మే (భార్యకు ఫైజ్ జైలు నుంచి రాసిన ఉత్తరాలు-1971), మతాఏ-లౌహ్-ఓ-కలమ్ (ఉపన్యాసాలు, వ్యాసాలు, ఇంటర్వ్యూలు, నాటకాల సంకలనం-1973).

పాకిస్తాన్ ప్రభుత్వం ఫైజ్‌ని 1951లో ఒకసారీ, 1958లో మరొకసారీ అరెస్టుచేసి జైలుపాలు చేసింది. అతని 'జిందానామా' అనే కవితా సంపుటి జైలు రోజుల నాటిదే! 1962లో ఫైజ్‌కి 'లెనిన్ శాంతి పురస్కారం' లభించింది. అతడనేకమార్లు తూర్పు, పశ్చిమ దేశాలను చుట్టివచ్చారు. 1978లో ఏఫ్రో-ఏషియా రచయితల సంఘపు 'లోటస్' పత్రికకు సంపాదకుడిగా పనిచేశారు.

ఫైజ్ సుమారు నాలుగు దశాబ్దాలపాటు తన అనితర సాధ్యమైన కవిత్వలోకంలో

సంచరించారు. అయితే మారుతున్నకాలంతోపాటు తనూ మారారు. వస్తువూ, రూపమూ...రెండింటినీ మార్చుకున్నారు. అతడు తన మొదటి కవితా సంపుటి 'నక్ష్-ఏ-ఫరియాదీ' నుండి చివరిదైన 'మేరే దిల్ మేరే ముసాఫిర్' వరకు చాలా మారిపోయారు. అదొక సుదీర్ఘమైన భావజాల పరిణామ ప్రపంచం. 'నక్ష్-ఏ-ఫరియాదీ' మొదటిభాగంలో మనకి అతడు ఏ చీకూ చింతాలేని షోకులరాయుడిలా కనిపిస్తారు. అప్పుడతను ప్రణయ కవితలు రాశారు. నవయువకుడిలా వున్న ఏ కవికైనా అది సహజమే కదా! 'హుస్న్-ఏ-ఇశ్కు' కొచ్చేసరికి తీపికలలు కంటున్న టీనేజీ, కాలేజ్ యువకుడు ఫైజ్‌లో కన్పిస్తాడు. కానీ కవి తన చుట్టూ మారుతున్న పరిస్థితుల్ని అతిజాగ్రత్తగా గమనిస్తూ వుంటాడు కనుక 1930నాటి ఆర్థిక మాంద్యం, రైతుకూలీల ఉద్యమాలూ, 1936 నాటి ప్రేమ్‌చంద్ తదితరుల అభ్యుదయ రచయితల సంఘ ప్రాదుర్భావం...అన్నీ కలిసి ఈ నవయువకుణ్ణి ఒక్క వూపు వూపాయి. ఫైజ్ మెదడుకు మేత వేశాయి. అతని హృదయాన్ని మొత్తానికి మొత్తంగా కదిలించాయి. అందుకే 'నక్ష్-ఏ-ఫరియాదీ' రెండో భాగానికొచ్చే సరికల్లా తన ప్రేయసితో.

"ప్రియతమా! నా నుండి మునుపటి ప్రేమను కోరకు
ప్రపంచంలో ప్రేమే కాదు మరెంతో దుఃఖమూ వుంది"

అని చాలా నిక్కచ్చిగా చెబుతారు. దుఃఖకారణాలు అన్వేషించాలి అంటారు. ఫైజ్‌కి ప్రారంభదినాల్లో ప్రపంచమంతా ప్రేమమయం, తదనంతరం లోకమంతా శోకపూరితం.

ఫైజ్ కవిత్వంలో మలిమలుపు అతణ్ణి దేశద్రోహ నేరమ్మీద 'రావల్పిండీ సాజిష్ కేసు' పెట్టిన సందర్భంలో కల్గింది. అలా రెండుసార్లు కారాగార వాసాన్ని అనుభవించాల్సి వచ్చింది. అందుకే అతని తరువాతి కవిత్వంలో బేడీలు, సంకెళ్ళు, జైలుగోడలు, గొలుసులు, ఖైదీలు...మొదలైన పదజాలం చోటుచేసుకుంది. ఫైజ్ రాసిన గజళ్ళలోని కొన్ని శాయర్లు పాకిస్తాన్ సైనిక ప్రభుత్వాల దమననీతిని ఎండగట్టాయి.

'దస్త్-ఏ-సబా', 'జిందానామా'ల తర్వాత 'దస్త్-ఏ-తహ్-ఏ-సంగ్'లోని చాలా రచనలు జైలు అనుభవాల నేపథ్యంలోంచి వచ్చాయి. అయితే తర్వాతర్వాత ఫైజ్ వుడుకు నెత్తురు కాస్తా చల్లబడింది. అలా అనడం కన్నా ఆవేశపూరిత స్వభావం రవ్వంత నిదానించింది అని చెప్పుకోవడం బావుంటుంది. ఈ నెమ్మదించే గుణం వయస్సుతో వచ్చిపడిందే! ఆలోచనల్లో కూడా కొంత మార్పు గోచరించింది. ఆఫ్రికా,



యూరప్‌లు చుట్టి వచ్చాక ఫైజ్ దృష్టి ప్రపంచ పర్యాప్తమైపోయింది. విశ్వ మానవుడి దుఃఖమ్ముందు తమవాళ్ళ బాధ కాస్త చిన్నదైపోయింది. ప్రపంచ మానవుడి వేదనలో భాగమే పాకిస్తానీ సోదరుల బాధ అని తెలిపోయింది. నానాటికీ ఫైజ్ దృష్టి విశాలతరమై అరబ్-ఇజ్రాయిల్ యుద్ధ సమయంలో 1967లో 'సర్-ఏ-వాదీ-ఏ-సేనా'లాంటి కవితల్ని అతనితో రాయించింది. ఈ కవితలో ఆసాంతం సామ్రాజ్యశక్తులన్నీ ఏకమై పాలస్తీనియన్లను తాము పుట్టి పెరిగిన నేలకు దూరం చేసిన విషయం వస్తువుగా మారిపోయింది.

ఇలా పరిణమిస్తూ పరిణమిస్తూ ఫైజ్ మానసిక ప్రపంచం విస్తృతిని సాధించింది. చివరికతను అంతర్జాతీయ కవిగా మారిపోయారు. ప్రపంచంలో అంతటా ఏరులై పారుతోన్న ప్రజా సమూహాల నెత్తురుకు ఫైజ్ కవితలు చిత్తరువులయ్యాయి. 'హార్ట్ ఎటాక్' 'యతీమ్ లహూ', 'యహాఁసే శహర్ దేఖో'లాంటి కవితలు అనేకం నెత్తురు చుట్టూ పరిభ్రమించాయి. రానూ రానూ ఫైజ్ తన కవిత్వంలోని సాహిత్యభాషను త్రోసిరాజని వ్యావహారికానికి స్థానం కల్పించారు.

ఫైజ్ కవితల్లో కన్పించే విశ్వమానవ ప్రేమని, అణచివేయబడ్డ మనుషుల దుఃఖాన్ని పంచుకోవడానికి ఉర్దూ సాహిత్యలోకంలో సర్దార్ జాఫ్రీ నుండి ప్రొఫెసర్ కమర్ రయీస్ వరకు అందరూ ముందుకొచ్చినవాళ్ళే! అయితే ఫైజ్‌కి వున్న ప్రత్యేకత...ప్రజలతో మమేకం కావటం. ప్రపంచంలో ఏ మూలన ప్రజలు అణచివేతకి గురవుతున్నా ఫైజ్ రంగంలోకి దూకుతారు. ప్రతి అంతర్జాతీయ సంఘటనకీ స్పందిస్తారు. ఇరాన్‌లో విద్యార్థులు మృత్యుగహ్వరంలోకి నెట్టబడినప్పుడు, ఆఫ్రికాలో ప్రజలు స్వాతంత్ర్యపోరాటం సాగించినవేళ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అరబ్బులు ఏకమైన సందర్భంలో, పాలస్తీనియన్లు తమ భూమి కోసం, భుక్తికోసం పోరాడుతున్న తరుణంలో...అన్ని సన్నివేశాల్లోనూ ఫైజ్ అహ్మద్ ఫైజ్ కలం శత్రువుల మీదికి నిప్పులు చెరిగింది. అతని కవిత్వం స్థలకాలాల్ని దాటి యథార్థ జీవులకు బాసటగా నిలిచింది. ఊరటనిచ్చింది. ఫైజ్‌ది సమస్త మానవజాతి అక్షరం.

*(రాజ్‌కమల్ వారి 'ఫైజ్-ప్రతినిధి కవితాయేఁ' ఆధారంగా)*

*ప్రజాసాహితి ఫిబ్రవరి, 2002*

# జానపద వాఙ్మయోద్ధారకుడు-ప్రభాకరశాస్త్రిగారు : సామెతలు, పలుకుబళ్ళు, గాలికబుర్లు

శిష్టసాహిత్యంతోపాటు జానపద సాహితీక్షేత్రాన్నీ సుసంపన్నం కావించిన వాఙ్మయ బ్రహ్మ కీ.శే. ప్రభాకరశాస్త్రిగారు పట్టిందల్లా బంగారమన్నట్లు ఆయన తాను చేపట్టిన ప్రతి సారస్వత ప్రక్రియనూ పారమంట పరిశోధించి పరిపోషించారు. వివిధరంగాల్లో శాస్త్రిగారి కృషి పరిశోధక విద్యార్థులకిప్పటికీ శాస్త్రీయంగా వుండడం ఆశ్చర్యకరం, ఆనందదాయకం. పండితులు చాలామందిచే నిరాదరణం పాలవుతున్న సహజసుందర జానపద సాహిత్యాన్ని సముద్ధరించి భావి పరిశోధకులకు కావల్సినంత ముడిసరుకును అందించారు.

సామాన్యుడి సద్యస్ఫూర్తికి ఆవిష్కృతి సామెత. అది జ్ఞానవిదులైన జానపదుల పారంపరికమైన అనుభవాల పాతర. తత్ప్రాధాన్యం తెలిసినవారు కాబట్టి పల్లీయుల రసనాగ్రాలపై యిళ్ళుకట్టుకొన్న సామెతలు వారిని ఆకట్టుకొన్నాయి.

"పాటలు, పదాలు, పొడుపుకథలు, సామెతలు, పలుకుబళ్ళు, నానుళ్ళు, దేశీయములు, నొడికారములు, జాతివార్తలు, చమత్కారములు, పొడుపు పద్యములు, చాటుధారలు, లక్షణోదాహరణములు మొదలయిన వాటిని, బాషాసస్యపు పంటలలో ఇది వరకు సేకరముగాక గాలికి కొట్టుకొనిపోతూ ఉండే చెదరుడు, రాలుడు, పరిగ గింజలను, బిచ్చగాడనై ఊళ్ళూ నాళ్ళూ తిరుగుతూ, ముప్పై యేళ్ళ ముందు నుండి



ఎక్కడ పట్టితే అక్కడల్లా యేరుకు తెచ్చుకుంటూ ఉన్నాను" అన్నారు శాస్త్రిగారు.[1] ఈ విషయం 1944 జనవరి, ఫిబ్రవరి, జూన్ మాసాల్లో 'ఆంధ్రపత్రిక' ఆదివారం సంచికల్లో ప్రస్తావ్యం. (పలుకుబళ్లు మొదలైన వ్యాసాలలో) అయితే-ఈ వ్యాసం ప్రకటింపబడ్డానికి ముందు ముప్పైయేళ్ళనుండి పరిశ్రమిస్తున్నానన్నారు. అంటే-1910-14 ప్రాంతాలనాటి కృషి అన్నమాట. అయితే....సామెతల్ని మొట్టమొదట సేకరించి ప్రకటించినవారు కేప్టెన్ యం. డబ్ల్యు. కార్ గారు (1868లో). తదనంతరం సామెతల క్షేత్రంలో పలువురు కృషి చేసినా లక్షసామెతల యజ్ఞం చేయతలపెట్టిన డా॥ చిలుకూరి నారాయణరావు గారి కృషి పేర్కొనదగ్గది. నారాయణరావుగారు సామెతలు సేకరిస్తున్నట్టు తెలిసిశాస్త్రిగారు", వారు సామెతలు లక్ష ప్రకటింపదలపెట్టుట సంతోషము. సామెతలు కూడ కొన్ని నేను సేకరించినవి ఉన్నవి. అవి వారికి పంపుదునంటిని" అని లేఖ రాసారు.[2] ఏ కారణాంతరాల మూలంగానో శాస్త్రిగారు సేకరించిన వేలకొలది సామెతలు వెలుగుచూడకుండా ఇప్పటి వరకూ మిగిలిపోయినై. శాస్త్రిగారు సేకరించిన సామెతల్లో వందలకొలది కొత్త సామెతలు వుండడం ఆశ్చర్యకరం. ఇంతవరకు ఏ సామెతల సంకలన గ్రంథాల్లోనూ, సామెతలపై వచ్చిన పరిశోధనా వ్యాసాల్లోనూ చెప్పబడని నూతన సామెతలు వారు సేకరించి పెట్టుకున్న ఆముద్రిత వ్రాతప్రతుల్లో వున్నాయి. ఉదాహరణకి కొన్ని :

1. అరవ రహస్యం బట్టబయలు
2. అరవ నోరు డబ్బాలోని రాళ్ళునొకటి
3. భార్యమీద కోపం బడిపిల్లల మీద చూపింది
   బడిపిల్లల మీద కోపం భార్యా పిల్లలమీద
4. ఇల్లాలు ఇంటిలో నుండును
   బజీతుది బయట పడును.
5. దరిద్రమైతే కడుపుపెద్ద.
   తల్లి చస్తే కూతురు పెద్ద.
6. బిడ్డ కుడిచినదికాదు, మొగుడు పట్టినదికాదు.
7. పతివ్రతకు పదిమందైతే మహాపతివ్రతకు మఱెందరు?
8. ఒసే అంటే ఒరే అంటుంది.

9. అవసర మైథునాని కచ్చట్లా ముచ్చట్లా?

10. మనుష్యుల పొత్తు జొన్నచేను ఒత్తుకూడదు.

11. పాయంలో మొగుడు జస్తే పస్తుంటారా?

12. మెడబడ్డ మేనతికమా?

13. చందనవనంలో తుమ్మచెట్టు పుట్టినట్లు.

14. అవ్వ ఆటకెక్కితే తాత మంచమెక్కినాడు.

ఇలా వందలకొలది కొత్తసామెతలు వారి సేకరణలో వున్నాయి. స్థలాభావం వల్ల కొన్నింటిని మాత్రమే పేర్కొన్నాను. ఇవన్నీ ప్రత్యేకంగా పుస్తక రూపంలో ప్రకటింపబడితే ప్రయోజనకరంగా వుంటుంది.

## పలుకుబళ్ళు, గాలికబుర్లు

సామెత సంపూర్ణ వాక్యమైతే పలుకుబడి కొన్నిపదాల బంధం. అందుకే అది పదబంధమైంది. నుడికారము, నొడికారము, జాతీయము అని పర్యాయపదాలు. శాస్త్రిగారు పలుకుబళ్ళని గాలికబుర్లుగానూ, లబ్జులుగానూ పేర్కొన్నారు. గాలికున్నంత వ్యాప్తీ, వేగమూ వీటిలక్షణాలు కాబట్టి గాలికబుర్లుగా వ్యవహరించబడ్డాయి. భాషలో వీటి ప్రయోగం లబ్జుగా, రంజుగా వుంటుంది. కనుక లబ్జులన్నారు. పైరెండు పేర్లేకాకుండా పలుకుబళ్ళని పలుకుగుత్తులు అనడం వారికి అచ్చతెనుగుపై ఉన్న మమకారాన్నీ, ఆసక్తినీ సూచిస్తుంది. రెండు, మూడు పొడి పొడి మాటలు కలిసి ఒక విలక్షణమైన, వినూత్నమైన అర్థాన్ని యివ్వడం పలుకుబళ్ళ ప్రత్యేకత. తెలుగు చదువులతల్లికి పుట్టిన పొట్టిబిడ్డ పలుకుబడి కానీ భాషలో దాని పలుకుబడి గట్టిదీ, గొప్పదీ. ఆకృతి చిన్నదైనా అనుభవం గొప్పది. అలాగే ప్రభావం గొప్పది. అనంతకోటి భావసంపదని గర్భీకరించుకున్న విశిష్ట సాహిత్య ప్రక్రియ కాబట్టే శాస్త్రిగారు వాటిని సంగ్రహించడానికి కటిబద్ధులయ్యారు. తెలుగుదేశం నలుచెఅగులా పర్యాప్తమై ఉన్న బళ్ళకొలది పలుకుబళ్ళను సేకరించారు. అయితే-వారు సేకరించిపెట్టిన సామెతలకి మల్లే ఇవికూడా ముద్రణకి నోచుకోకపోవడం విచారకరం. "నుడికారాలను వేఱుగా, ఆకారాదిగా సంగ్రథనం చేయడానికి తొట్టతొలిసారి ప్రయత్నించినవారు శ్రీ నాళం కృష్ణారావుగారు".[3] అయినా శాస్త్రిగారి కృషి శాస్త్రీయం, మార్గదర్శకం.



"...పలుకుబళ్ళు త్రవ్వి తండములుగా తెలుగులో నున్నవి. ఇటువంటి వాటినన్ని సేకరించేవారినీ, ప్రకటించేవారినీ సముత్సాహ పఱచి, వారి వారి సేకరములు ప్రచారమున కెక్కునట్లు చేయుట మిక్కిలి కావలెను"[4] అని ఆ రోజుల్లోనే అనగలిగారు 1930 అక్టోబర్ 'ఆనందవాహిని' పత్రికలో. ఈ పత్రికకు శాస్త్రిగారే పరోక్ష సంపాదకులు. ఇది హాస్యపత్రిక. తమిళంలోని 'ఆనంద వికటన్' అనే పత్రికా యాజమాన్యమే పై పత్రికని తెలుగులో కొన్నాళ్ళ పాటు వెలువరించింది. ఆ పత్రికలో 'తెలుగు పలుకుబళ్ళు' పేర ఒక వ్యాసం రాశారు శాస్త్రిగారు.

"గ్రంథములోని కెక్కినవి గాక వాడుకలో ఎన్నో వింత వింతల పలుకుబళ్ళు నాలుకలపై నాట్యమాడుచుండును. స్త్రీలు, బాలులు, పామరులు, పండితులు వడివడిగా మాట్లాడేటప్పుడు అప్రయత్నముగా చమత్కార గర్భితములైన పలుకుగుత్తులు ఎన్నో గుచ్చుతూ ఉంటారు. శక్యమైనంతవరకు వాటిని సంధానించి ప్రకటింపబూనినాను"[5] అని తమ పూనికను అభివ్యక్తీకరించారు. అంతకు ముందు ఈ జాతీయముల గురించి అఅకొఅగా జరిగిన కృషి గురించి విచార పడ్డారు. ముసునూరి వేంకటశాస్త్రిగారి 'విద్యార్థి కల్పతరువు'లో 'తెలుగు జాతీయములు' పేర 856 జాతీయములు ప్రచురించారు. రెంటాల గోపాలకృష్ణగారు 'జాతీయాలు-పుట్టు పూర్వోత్తరాలు-సంస్కృత న్యాయాలు' అనే గ్రంథంలో 105 జాతీయాలనూ, 51 సంస్కృత న్యాయాలనూ వివరించారు. ఇక తదనంతరం జాతీయాలపై సమగ్ర కృషి 'పదబంధ పారిజాత' సంపాదకులది. (నార్ల వెంకటేశ్వరరావు, విద్వాన్ విశ్వం, తిమ్మావజ్ఝల కోదండరామయ్య) ఇవి రెండు సంపుటాలుగా ముద్రించబడ్డాయి. ప్రథమ సంపుటం ఆగస్టు, 1959లో ప్రచురించ బడింది. ఈ సంపుటంలో 9,536 జాతీయాలకి వివరణలున్నాయి. జూన్, 1961లో ముద్రించబడిన ద్వితీయ సంపుటంలో 9,810 జాతీయాలున్నాయి. అంటే ఈ రెండింటిలోని మొత్తం జాతీయాల సంఖ్య 19,346. సంపాదకులు పదబంధ పారిజాతాన్ని 'నుడికారముల బృహన్నిఘంటువు'గా పేర్కొన్నారు. రెండు సంపుటాలూ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణలు. అయితే....యిదంతా కూడా శాస్త్రిగారి తదనంతర కృషి. పైగా ప్రభాకరులు సేకరించిన పదబంధాల్లో ఓ ప్రత్యేకత ఉంది. వాటిల్లో ఎక్కువగా వాడుకలో వున్నవే. అంటే శాస్త్రిగారికి వ్యవహారంలోని పలుకుబడి అంటే ముక్కువ. పదబంధ పారిజాత కర్తలు ప్రచురించి వివరించిన 19,346 పదబంధాల్లో ఎక్కువగా ప్రాచీన గ్రంథాల్లోని పలుకుబళ్ళు చేరాయి.

మరో విస్మయకరమైన విషయం....శాస్త్రిగారు 1914 ప్రాంతాల్లో సేకరించిన పదబంధాల్లో చాలా భాగం 1959,61 సంవత్సరాల్లో ముద్రితాలైన పదబంధ పారిజాతాల్లో లేవు ఉదాహరణకి "అదృష్టం పండింది; అదుగో అంటే ఆర్నెల్లు, బ్రహ్మదేవుడి శంకనార్తి; అధ్వాన్నం శత్రుమధ్యం; అ-అంటే అపరాధం, ఉ-అంటే ఉపరోధం; అన్నందాలా అవస్థ పడుతున్నాడు; అసలు సందేవేళ; అయితేగియితే కయితేపల్లి; పదరాని పాట్లెల్లా పడ్డారు; అడ్డం దిగటం; అల్లాడి ఆకులు మేశారు; అమ్మా తల్లీ అని బ్రతిమాలుకున్నారు" మొదలైన అనేక పదబంధాలు తదనంతర గ్రంథాల్లో చేరలేదు ప్రభాకరులు సేకరించి పెట్టుకొన్న వేలకొలది పదబంధాల్లో కొన్నింటిని మాత్రమే ఆయన వ్యాసాలుగా ప్రకటించారు.

1944 జనవరి, ఫిబ్రవరి, జూన్ మాసాల్లో ఆంధ్రపత్రిక ఆదివారం సంచికల్లో 'గాలి కబుర్లు' అనే పేర ఆయన వ్యాసాలు వెలయించారు. ఆ రోజుల్లోనే ప్రశంసనీయమైన కృషి చేసి, "వాటిని (పలుకుబళ్ళని) దేశము నలుమూలల వారు సేకరించడం మంచిదని భాషా క్షేత్రమును సర్వే చేయవలసి ఉన్నది" అని రేడియోలో ప్రసంగించిరట.[6] ఆంగ్లభాషా పరిజ్ఞానం వల్ల అబ్బిన భాషా క్షేత్ర పరిశీలనావశ్యకతను శాస్త్రిగారు ఆనాడే గుర్తించడం వారి ముందుచూపుకి చక్కని తార్కాణం.

ప్రభాకరులు పలుకుబళ్ళని సేకరించడంలో ఎంతసేపూ ప్రజల నాలుకలని ఆకర గ్రంథాలుగా గ్రహించారు. వీరి సేకరణలోని మరో విశేషం....ఆనాడే వారు వీటిని ఆకారాదిగా సంగ్రంథనం చేయడం సులువుకాదనీ, వర్గీకరణ అవసరమనీ చెప్పడం. అంటే...ఈనాడు మనం అనుసరిస్తున్న పరిశోధనాపద్ధతులు (మెథడాలజీ) అప్పుడే వారు గుర్తించారు. తదనుగుణంగానే తమ ప్రణాళిక ఏర్పరచుకున్నారు.

"నేను వానిని (పలుకుబళ్ళను) అకారాది క్రమముగా నిఘంటువుగా సేకరించడము లేదు. అమరమువలె మనుష్య వర్గము, జంతు వర్గము, గ్రామ వర్గము, జాతి వర్గము, శరీర వర్గము, బాంధవ వర్గము, నిందా వర్గము, వ్యవహార వర్గము, నామ వర్గము, కథా వర్గము, ఇత్యాది విధముల వర్గీకరించి వాటికి వాటికి సంబంధించిన పలుకుబళ్ళను, ఆయా వర్గములలో కూరుస్తున్నాను. ఈ విధముగా సేకరిస్తే విషయము సులువుగా తేలుతుందనుకున్నాను. నేను చేస్తున్న తీరిది" అన్నారు.

ప్రప్రథమంగా పదబంధాల్లో వర్గీకరణ ప్రవేశపెట్టింది వీరే. తెలుగు జాతీయముల బృహన్నిఘంటువైన పదబంధ పారిజాతమూ అకారాది క్రమ గ్రంథమే. అకారాది



సేకరణ సౌకర్యం చేకూర్చగలదని, విస్మయపరమైన వింగడింపు ప్రయోజనకరమని గ్రహించి గ్రథించిన వారు శాస్త్రిగారు. 1944 ప్రాంతాల్లో ఆంధ్రపత్రికలో వారు ప్రకటించిన 'గాలి కబుర్లు' వ్యాసంలో వీరు బిరుదువర్గంలో 150 పలుకుబళ్ళనీ, జాతివర్గంలో 88 పలుకుబళ్ళనీ, అవయవ వర్గంలో 205 పదబంధాలనూ, జంతువర్గంలో 1560 టినీ, నిందా వర్గంలో 371లనూ, ప్రశస్తి వర్గం (ఊళ్ళ మీద) లో 133 పలుకుబళ్ళనీ ప్రకటించారు. ఈ వర్గీకరణలో సైతం మళ్ళీ ఉపవిభాగ క్రమపద్ధతిని అవలంబించారు. ఉదాహరణకి జంతువర్గంలోని పలుకుబళ్ళని కలగూర గంపలా కాకుండా దాదాపు ఒక్కో జంతువు పేర ఉన్న పదబంధాలన్నింటినీ ఒక చోట రాసుకున్నారు.

కోడి కూత, కోడి నిద్ర, కోడి కెక్కరింపు, కోడి కునుకు...ఇలా యివన్ని కోడిపరంగా వున్న పలుకుబళ్ళు. అలాగే కుక్క బుద్ధి, కుక్క తోక, కుక్క విశ్వాసము, కుక్క జుట్టు, కుక్క పీకులాట యిలా సాగింది వీరి వర్గీకరణ పద్ధతి. అంతేకాకుండా వింగడింపులో వీరి సూక్ష్మ పరిశీలన గోచరిస్తుంది. ఉదాహరణకి అదే జంతువర్గంలో సింహము తెలుగు దేశపు జంతువు కాదు కాబట్టి దాని పేరున పలుకుబళ్ళు అన్నీ సంస్కృతమయములు అంటారు. "సింహ స్వప్నము, సింహ మధ్యము, సింహ కేసరమే, సింహ ముఖము, సింహ తలాటము, సింహ గర్జనము, సింహాసనము, సింహావలోకనము ఇత్యాదులు."

ఇక....పలుకుబళ్ళను ఆయా వర్గాల కింద కూరుస్తూ కొన్నింటికి వివరణలు యివ్వడం, మరికొన్నింటికి కథ వుంది అని బ్రాకెట్లలో రాయడం వీరి ప్రత్యేకత. 'నక్కవేటగాడు, కొంగల మల్లాయకొండ, గడ్డం వపనే ముచ్చతే, గాడిదగుడ్డు, తీతువుపిట్ట రాయబారము, మిడతంబొట్లు జోస్యం' మొదలగు వాటికి 'కథ వుంది' అని రాశారు. నిందా వర్గంలో 'బడుద్ధాయి' అనే పలుకుబడి 'దభిర్దాయ'కు వికృతి అని పేర్కొంటారు. అంటే పలుకుబళ్ళని కేవలం సాహితీ దృక్పథంతో కాకుండా భాషా దృష్టితోనూ గమనించారు.

ప్రశస్తి వర్గంలో (ఊళ్ళమీద) వీరు సేకరించిన పలుకుబళ్ళు వీరి జానపద వాఙ్మయాసక్తినే కాకుండా, తమ పరిసర పరిజ్ఞానాన్ని వ్యక్తం చేస్తున్నాయి. అసలు ఈ వర్గం చదువుతుంటే నవల చదువుతున్నంత ఆసక్తికరంగా వుంటుంది. మచ్చుకి కొన్ని:

బందరు బడాయి, గుంటూరి లడాయి, నెల్లూరి నెఱజాణలు, కొండవీటి చేంతాళ్ళు, ఒంగోలు గిత్తలు, కంభం చెరువు, బెజవాడ యెండలు, చిత్తూరు చింతపండు, హిందూపురం బెల్లం, వెంకటగిరి వేశ్యలు, లంక పొగాకు, తుని నూనె, తెలుగు గోంగూర, అరవ సాంబారు అంటూ తెలుగుదేశం ఎల్లలు దాటి అరవదేశంలోకి వెళ్ళిపోతారు ప్రభాకరులు.

బిరుద వర్గంలో ఆధునిక కాలాల్లోనివీ, ప్రాచీనాకాలాల్లోనివీ...రెంటినీ చేర్చారు. అంతే కాకుండా యతర రాష్ట్రాల బిరుదులూ కూర్చారు. ఉదాహరణకి పిళ్ళ (అరవ, మలయాళీల బిరుదు), ఉపాధ్యాయుడు (బెంగాలీ, ఒరియా భాషలది) మొదలైనవి. ఈ వర్గాన్ని రాయడంలో భాషా పరిణామ క్రమాన్ని సూచిస్తారు. ఉదాహరణకి రౌతు, రావుత్తుడు, రాహుత్తుడు అనే పద క్రమంలో అలాగే-గారు,-లుంగారు, -నింగారు అనేవి. ఈ అనుబద్ధ రూపాలను ఇలా పేర్కొనడంలో నవ్యధోరణి కానవస్తుంది.

అమరంవలె వర్గీకరణ పాటిస్తున్నానని తాము బిరుదు, జాతి, అవయవ, జంతు, నిందా, ప్రశస్తి వర్గాలను మాత్రమే ప్రకటించారు. కానీ.....శాస్త్రిగారిది బృహత్ప్రణాళిక. వారు వివిధవర్గాల కింద సేకరించిన పలుకుబళ్ళు అముద్రితాలుగా వ్రాత ప్రతుల్లో మిగిలిపోయి ఉన్నె. చుబ్బన చూఅలైన ఆ పలుకుబళ్ళని వెలుగులోకి తీసుకురావడం అవసర కార్యం. వారి అముద్రిత వ్రాత ప్రతుల్లో వేలకొలది పలుకుబళ్ళు ఇంతవరకూ ఏ గ్రంథంలో చేరనివి వున్నాయి. పైగా ఆ అముద్రిత వ్రాత ప్రతుల్లో పలుకుబళ్ళను మరికొన్ని వర్గాల్లో సంగ్రహించి పెట్టుకొన్నారు శాస్త్రిగారు. ఉదాహరణకి 'వాక్యాలంకార వర్గం'లో ఉండనీయండి, అయితే కానీండి, ఇంతకు, ఏమిటోలెండి, అయితే అయింది కాని, సరేలే' మొదలైనవి చేర్చారు. 'అనగా అనగా, నేనదేమిటంటే, చెప్పబోయేదేమి టంటే, మఱిట-మఱేమో, అదే చెప్మా, అట్లా ఉంటూందే, ఇదుగో' ఇత్యాదుల్ని 'ఉపక్రమ' వర్గంలో సేకరించి పెట్టుకున్నారు. ఏమైనా వారి పలుకుబళ్లు అన్నీ పుస్తకరూపంలో రావడం ఆశించదగిన విషయం.

శాస్త్రిగారు బహుసాహిత్య ప్రక్రియాభరవ్యగ్రులు కావడంవల్ల (పీఠికలు, విమర్శలు, పాటలు, పదాలు, సామెతలు, కథలు, చాటువులు, ప్రసంగాలు, ఇత్యాదులు) ఒకే విషయం గురించి అదేపనిగా పరిక్రమించే అవకాశం వారికి లేదు. అలా జరిగేవుంటే పలుకుబళ్ళ క్షేత్రంలో పసిడి పంటలు పండేవి! (ప్రభాకరశాస్త్రిగారు సేకరించిన



సామెతలు, పలుకుబళ్ళు గల అముద్రిత వ్రాత ప్రతుల్ని చూపి ఈ వ్యాసం రాయడానికి ప్రోత్సహించి ఉపయోగించుకోవడానికి అనుమతించిన ఆచార్యులు డా॥ వేటూరి ఆనందమూర్తిగారికి కృతజ్ఞతలు).

## పాద సూచికలు

1. మణిమంజరి, వాఙ్మయయోగ పరిశోధన విశేష సంచిక 9, పే. 81 (గాలికబుర్లు-వ్యాసం; వేటూరి ప్రభాకరశాస్త్రి)
2. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చిలుకూరి నారాయణరావుగారికి వ్రాసిన లేఖలోని భాగం (అముద్రితం).
3. పదబంధ పారిజాతము, ప్రథమ సంపుటి పీఠిక, పుట ... ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైద్రాబాద్.
4. కామధేనువు కథ (భాషా ప్రసక్తి) - వేటూరి ప్రభాకరశాస్త్రి పే. 37 (సాహిత్యం, అన్ని తరగతుల వారికీ అనుభవింపతగి వుండాలి వ్యాసంలో)
5. అదే - పే. 38 (తెలుగు పలుకుబళ్ళు వ్యాసంలో)
6. మణిమంజరి, వాఙ్మయ యోగ పరిశోధన విశేష సంచిక 9, పే. 81 (గాలికబుర్లు వ్యాసంలో)
7. మణిమంజరి, వాఙ్మయయోగ పరిశోధన విశేష సంచిక 9, పే. 82 (గాలికబుర్లు వ్యాసంలో)

## ఉపయుక్త గ్రంథాలు

1. పదబంధ పారిజాతము-ప్రథమ సంపుటము-1959.
2. " " ద్వితీయ " 1961. - ప్రభాకర స్మారిక ఆం.ప్ర.సా. అకాడమీ హైద్రాబాద్.
3. జాతీయాలు-పుట్టుపూర్వోత్తరాలు-సంస్కృత న్యాయాలు రెంటాల గోపాలకృష్ణ, ద్వి-ముద్రణ, 1984. క్వాలిటీ పబ్లిషర్స్.
4. విజయవాడ, విద్యార్థి కల్పతరువు-ముసునూరి వేంకటశాస్త్రి, వెంకట్రామ అండ్ కో, 1984.
5. తెలుగు సామెతలు-మూడవకూర్పు-తెలుగు విశ్వవిద్యాలయం, 1986, హైద్రాబాద్.
6. ప్రభాకరశాస్త్రిగారి అముద్రిత వ్రాతప్రతులు, లేఖలు (సామెతలు, పలుకుబళ్ళపై పెద్ద రైల్వే నోటుబుక్కులో వ్రాసిపెట్టుకొన్నవి.) - ప్రభాకర స్మారిక

# నూరేళ్ళ మలయాళ కథా సాహిత్యమూ – తీరుతెన్నులు

మలయాళ సాహిత్యంలో కథకు నిండు నూరేళ్లు దాటి దాదాపు పది సంవత్సరాలు కావస్తోంది. ఒకానొక సాహిత్య ప్రక్రియా వికాసానికి సంబంధించి వందేళ్ళకాలం పెద్దగా చెప్పుకోదగిందేమీ కాదు. అయినప్పటికీ ఒక ప్రత్యేక సాహితీ ప్రక్రియగానే కాక మలయాళీల భావుకత్వాన్ని బాగా ప్రభావితం చేసిన ప్రక్రియగానూ అక్కడి కథకు ప్రఖ్యాతి వుంది. మలయాళీల సంవేదనలన్నీ వాళ్ల కథల్లో సమగ్ర రూపాల్లో ప్రతిఫలించాయి.

'విద్యావినోదిని' మాసపత్రికలో అచ్చయిన 'వాసనా వికృతి' మలయాళంలో మొట్టమొదటి కథ. 1891లో వచ్చిన ఈ కథను వేంగయిల్ కుంజిరామన్ నాయనార్ రాశాడు. వందేళ్ళ చరిత్ర కల్గిన మలయాళ కథా వికాసగతిని మనం ఐదు దశలుగా విభజించుకోవచ్చు. 1891 నుండి 1930ల వరకూ కొనసాగిన కాలం మొదటి దశ. 1930 నుండి 1950 దాకా కథ స్వర్ణయుగాన్ని అనుభవించిన కాలం రెండవది. 1950 మొదలుకొని ఒక దశాబ్దిపాటు వైయక్తిక జీవితాల్లోని దుఃఖభాజనమైన ఆంతరిక సంఘర్షణల్ని చిత్రీకరించిన చిత్తవృత్తి ప్రధానమైన కథలది తదనంతరం స్థితి. ఆధునికతా ప్రభావంతో కథలు అరవయిల్లో రావడం మొదలై డెబ్బయిలదాకా కొనసాగింది. ఇది నాల్గవ దశ. 1980 నుండి మలయాళ సాహిత్యంలో విభిన్నమైన కథలు ఉత్తరాధునికతా ప్రభావం వల్ల వస్తున్నాయి. ఇది చివరి దశ. సముచితమైన రీతిలో మూల్యాంకనం చేయడానికి ఇంకా వీల్లేని ఇప్పటి దశ ఇది.



కథ ప్రారంభకాలం నాటి తొలినాళ్ళలో మలయాళ కథ ఆదరణీయమైన సాహిత్య ప్రక్రియగా వికసించలేకపోయింది. జీవితాన్ని లోతుగా ఆవిష్కరించగల సామర్థ్యం కూడా ఆనాటి కథకు లేకపోయింది. అప్పటి కథా రచయితల్లో చాలామంది పాత్రికేయవృత్తిలో వుండి వుండటం చేత వాళ్లకి కథల్లోని సంఘటనల స్వరూపం గురించికానీ పాత్రల మనస్తత్వాల గురించి కానీ పెద్దగా అవగాహన లేదు. నలభై ఏళ్లు కొనసాగిన ఈ ప్రారంభకాలంలో కథారచయితలుగా ప్రసిద్ధులైనవారు వేంగయిల్ కుంజిరామన్ నాయనార్, ఎన్. గోపాల పణిక్కర్, మూర్కోత్తు కుమారన్, ఒడువిల్ కుంజికృష్ణ మీనన్ మొదలైనవాళ్ళు. అంబాడి నారాయణ పొతువాళ్, ఎం.ఆర్. కె.సి.కె. సుకుమారన్, ఇ.వి. కృష్ణపిళ్ల కూడా ఈ కాలపు రచయితలే.

వేంగయిల్ కుంజినాయనార్ కథల్లో వ్యాస లక్షణాలు ఎక్కువ. సంఘటనల్ని కేంద్రీకృతం చేసుకుని గోపాల పణిక్కర్ కథలు రాశాడు. కొంత నాటకీయతా, సంఘటనల్ని తీక్షణంగా వ్యాఖ్యానించేతీరూ ఇతని కథల్లో కలగలిసిపోయాయి. తొలినాళ్ళ కథల్లో సాధారణంగా కనిపించని సాంఘిక స్పృహ మూర్కోత్తుకుమారన్ కథల్లో ప్రధానంగా గోచరిస్తుంది. ఆభిజాత్యులైన స్త్రీ పురుషుల ఆదర్శ ప్రణయానికి ఒడువిల్ కుంజు కృష్ణమీనన్ కథలు దర్పణాలు. ఇతని కథలు దాదాపు నవలలంత పెద్దగా వుండేవి. అంబాడి నారాయణ పొతువాళ్, ఎం.ఆర్. కె.సిల కథలకు సమకాలీన జీవితంకాక భూతమే మూలభూతం. అయితే పొతువాళ్, భాషాశైలి ప్రత్యేకంగా గమనించదగింది. కె. సుకుమారన్ కథలు హాస్యరసస్ఫోరకాలై శృంగారంతో సింగారించబడ్డాయి. పాఠకుల్ని సాధ్యమైనంతవరకు ఆనంద డోలికల్లో వూపడమే ఇతని లక్ష్యం. ఇ.వి. కృష్ణపిళ్ల కూడా హాస్యకథా రచయితగా పేరు గడించినప్పటికీ కథాకథనంలో చాలావరకు గంభీరమైన ఉదాత్తమైన పద్ధతిని అవలంబించాడు. ప్రేమని ఉన్నతీకరించడం ఇతని కథల మూల ద్రవ్యం.

స్పష్టమైన సాంఘిక స్పృహతో మలయాళ కథలు 1925 నుండి రావడం మొదలైంది. అత్యంత నియమ నిష్ఠాగరిష్ఠులైన నంబూద్రుల్లో పుట్టి పెరిగి సంఘసంస్కరణోద్య మాలవల్ల ప్రభావితులైన కొంతమంది యువకులు నవజీవన నిర్మాతలయ్యారు. కథను శక్తివంతమైన ఆయుధంగా మలుచుకున్నారు. వి.టి. భట్టతిరిప్పాడ్, ఎం.ఆర్.బి. మూత్తిరింగాడు, భవత్రాతన్ నంబూద్రి ప్రభృతులు తమ నంబూద్రి కుటుంబాల్లో తరతరాలుగా కరడుగట్టి వస్తోన్న ఆచారాలకు విరుద్ధంగా కంఠమెత్తారు. తమ కలాల్ని

ఎత్తి పట్టారు. మలయాళ కథా చరిత్రలో అతిముఖ్యమైన పరిణామానికి నాందీ ప్రస్తావన చేసిన కథలు వీళ్ళవే. జాతీయోద్యమం, విద్యావ్యాప్తి, వామపక్ష భావజాలం, సంఘటితులైన కూలీలు, మలబారు రైతు ఉద్యమాలు. ఇలా ఎన్నెన్నో అంశాలు ఆనాటి కథలకు కొత్త కదలికలు నేర్పాయి. సాహితీరంగంలో అప్పుడప్పుడే ఆరంభమవుతోన్న కొత్త ఎరుకకు దిశానిర్దేశం చేశాయి.

అయితే ఈ మార్పుని త్వరితం చేసిన ఘనత మాత్రం కేసరి ఎ. బాలకృష్ణ పిళ్ళకు దక్కుతుంది. మలయాళీల బౌద్ధిక జీవితాన్ని వికసింపచేసిన ప్రతిభాశాలి ఈయన. సృజనాత్మకతను ప్రేరేపించిన మహా మనీషి బాలకృష్ణపిళ్ళ. 1922 నుండి 35ల దాకా కేసరి మొదలైన పత్రికలకు అధిపతిగా వుండి మలయాళీల రాజకీయ స్పృహకూ, సాంస్కృతిక చేతనకూ మార్గదర్శకుడై నిలిచాడు. మలయాళ కథకు గుణాత్మకమైన మార్పూ, మలుపూ కల్గించిన మనిషి. ఎంతోమంది నూతన కథా రచయితల్ని తన పత్రికల ద్వారా పరిచయం చేశాడు. అప్పటివరకూ చర్వితచర్వణంగా వస్తోన్న ప్రేమ, హాస్యం మొదలైన కథా వస్తువుల్ని మార్పించి మనిషి ప్రాథమికావసరాలైన ఆకలీ, కామాదుల్ని కథల్లోకి చేర్పించాడు. అంతేకాదు యూరోపియన్ భాషల్లోని ఉత్తమోత్తమ కథల్ని మలయాళంలోకి అనువదించాడు. ఈ సమయంలోనే ఎం.పి. పోళ్ 'ఖండకథా ప్రస్థానం' రాశాడు.

ఈ రెండవ సన్నివేశంలోని పూర్వార్ధంలో మలయాళ కథని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన రచయితలు ఐదుగురు. వీళ్ళు ఎస్.కె. పొట్టెక్కాట్, తకజి శివశంకరపిళ్ళై, కేశవదేవ్, పొన్‌కున్నంవర్కి, వైకం మహమ్మద్‌బషీర్‌లు. వీళ్ళంతా యుగకర్తలు. వీళ్ళలో స్పష్టమైన సిద్ధాంతజ్ఞానంతోనూ, సూక్ష్మమైన మనస్తత్వ శాస్త్ర స్పృహతోనూ కథారచన చేసిన వ్యక్తి తకజి. కుట్టనాడన్ ప్రాంతంలోని రైతుల జీవితం తకజి కథల్లో ప్రత్యేకంగా కన్పిస్తుంది. మధ్యతరగతి జీవుల మందహాసాలూ, దుఃఖాలూ చెబుతున్నప్పుడు, తకజిలోని కథా రచయిత క్షణక్షణం జాగరూకుడై కన్పిస్తాడు. ఆర్థిక అసమానతల కుదుళ్ళలోంచి తలెత్తిన జీవన సమస్యల్ని స్పష్టమైన సిద్ధాంత నేపథ్యంలో పరిశీలించి ఆ సిద్ధాంత జ్ఞానసారంతో రూపుగట్టిన కథా శిల్పాన్ని యథాతథంగా ఆవిష్కరిస్తాడు.

కమ్యూనిస్టు కార్యకర్త, రైతుకూలీ నాయకుడు అయిన కేశవదేవ్ కథల్లో సోషలిస్ట్ రియలిజం కన్పిస్తుంది. దేవ్ కథల పొడుగూతా కూలీలూ రైతుకూలీలూ దర్శనమిస్తారు. అట్టడుగు వర్గాల జీవిత దుఃఖాలకు దేవ్ కథలు చక్కటి వ్యాఖ్యానాలు. మరో రచయిత



పొన్‌కున్నం వర్కి మధ్య తిరువాన్కూర్‌లోని రైతులూ, కూలీలతో పాటు క్రైస్తవ జీవితాల్లోని పీడిత పార్శ్వాల్ని ప్రధానంగా తన కథలద్వారా చెప్పాడు. చర్చి ఆధిపత్యాన్ని ధిక్కరించాడు. ఫాదర్‌ల దోపిడీని చీల్చి చెండాడుతూ నిలువెత్తు వ్యవస్థీకృత విలువలకు ఎదురొడ్డి నిలిచిన ధీరోదాత్తుడీయన.

ఎస్.కే. పొట్టెక్కాట్‌కు ప్రపంచాన్ని చుట్టివచ్చిన అనుభవం పుష్కలంగా వుంది. వ్యక్తిగతంగా తను వామపక్ష రాజకీయాలు కల్గిన వాడైనప్పటికీ తకజి, దేవ్, వర్కిల్లో కన్పించే రాజకీయస్పృహ, సైద్ధాంతిక నిబద్ధతలు పొట్టెక్కాట్ రచనల్లో కన్పించవు. ఇతని కథలు కాల్పనికతకు అద్దం పట్టిన కథలు. ఈ రోజుల్లోనే మిగిలిన వాళ్ళకన్నా విలక్షణ మైన రీతిలో కథలు రాసిన వ్యక్తి వైకం మహమ్మద్ బషీర్. దుర్భర దారిద్ర్యం, సుదీర్ఘ దేశాటనం, జాతీయోద్యమంలో అనుభవించిన జైలుశిక్ష, చిత్తవిభ్రమం మొదలైనవన్నీ బషీర్‌ను ఉత్తమ కథా రచయితగా మలచడంలో దోహదపడ్డాయి. పాత్రల బాహ్యప్రవృత్తి కన్నా ఆంతరిక ప్రకృతికి ఎక్కువ విలువనిచ్చిన రచయిత ఇతను. సామాజిక జీవితంలోని కాపట్యాలను తనదైన రీతిలో చూపించి ఒక ప్రత్యేక కథా ప్రపంచంలోకి పాఠకుల్ని పట్టుకొని వెళతాడు. ముస్లిమ్ జీవితాల్లోని కడగండ్లను మొదటిసారిగా మలయాళ కథా వేదికమీద నిలబెట్టాడు.

లలితాంబిక అంతర్జనం సాంఘిక స్పృహతో కలం పట్టిన రచయిత్రి. దుర్మార్గమైన పితృస్వామ్యానికీ, క్రూరమైన ఆచారాలకూ ఆహుతై అల్లాడిపోయే నంబూద్రి కుటుంబాల్లోని స్త్రీల బాధల్ని స్త్రీ దృక్కోణంలోంచి చిత్రించిన రచయిత్రి లలితాంబిక. 1940 ప్రాంతాల్లో ఇంకా కారూర్ నీలకంఠ పిళ్ల, ఉరూబ్‌లాంటి సమర్థులైన రచయితలు వచ్చారు. ఆయా సిద్ధాంతాల ఛాయలో, అభ్యుదయ, విప్లవ దృక్పథాల్లో వీళ్ల కథల్లో కనిపించవు. నిత్యమూ ఆర్థిక సమస్యలతో సతమతమయ్యే మధ్యతరగతి మానవుల ఈతిబాధలు, ధర్మసంకట పరిస్థితులు కారూర్ కథలకు కేంద్రబిందువులు. ఈ శతాబ్ది పూర్వార్ధంలో తక్కువ వేతనాలతో పనిచేసిన ఉపాధ్యాయుల కష్టాలూ, కన్నీళ్ళూ కారూర్ కథలకు అంతర్‌సూత్రాలు.

'కవి కాస్త మునిగి తేలితే కథా రచయిత అవుతాడు' అన్నది ఉరూబ్ అభిప్రాయం. మానవుడి అనుభవాన్ని సమర్థవంతంగా వ్యాఖ్యానించిన కథలితనివి. మానవుడి పట్లా, అతని మంచితనం పట్లా అచంచలమైన విశ్వాసం ఉరూబ్‌ది. అందమైన శైలి, కవితాత్మక కథనం, ప్రసన్న మధురమైన నడక ఉరూబ్ కథల్ని శిల్పపరంగా బాగా

తీర్చిదిద్దాయి. కథా రచనలో తనదైన ఒక ముద్రవేసిన రచయిత్రి కె. సరస్వతి అమ్మ. స్త్రీ వ్యక్తిత్వం కోసం ఆరాటపడిన రచయిత్రి సరస్వతి. పులిమాన్ పరమేశ్వరన్ పిళ్ల, జోసఫ్ ముండశ్శేరి, ఎం. గోవిందన్, ముట్టత్తు వర్కి మొదలైన వాళ్లు ఈ రెండో ఘట్టానికి సంబంధించిన రచయితలు.

1950 ప్రారంభంలోనే మలయాళ కథాగమనంలో కొన్ని విస్పష్టమైన మార్పులు కనిపించసాగాయి. ఇది మూడవదశ. కథల్లో వస్తుపరంగా వ్యక్తి తాలూకు సాంఘిక చేతనలకన్నా ఆంతరిక భావాలకూ, శిల్పపరంగా సంఘటనలకన్నా మనోవృత్తులకూ ప్రాధాన్యం లభించిన కాలమిది. టి. పద్మనాభన్, ఎం.టి. వాసుదేవన్‌నాయర్ ప్రభృతులు ఈ కాలం రచయితలు.

ఆశలూ, ఆశయాలూ అనుక్షణం విధ్వంసమవుతున్న స్వాతంత్ర్య భారతంలో మనుషుల స్థితిగతులు అత్యంత దుఃఖమయం అవుతోన్న సమయం ఇది. ఈ దుఃఖానికి కారణం వ్యవస్థ అయినప్పటికీ అది వ్యక్తి మనసుని సంఘర్షణకు గురిచేసిన తీరు ఈ తరం కథా రచయితల్ని తీవ్రంగా కలచివేసింది. అందుకే వీళ్లంతా తమ కలాల్ని మనుషుల మనసుల్లో ముంచి కథలు రాశారు. జేమ్స్ జాయ్స్, వర్జీనియా ఉల్ఫ్ రచనల ప్రగాఢ ప్రభావం కూడా వీళ్ల మీద పడింది. పద్మనాభన్ కథలు సమస్త దుఃఖాలకు పరిష్కారం కనుగొనే దిశలో సాగక దుఃఖాన్నే ఆలంబనగా, ఓదార్పుగా తీసుకున్నాయి. కథల్లో కవితాత్మకతను ప్రవేశపెట్టి సుమారు ఏభై ఏళ్ళుగా కేవల కథా ప్రక్రియకే అంకితమైన విలక్షణ కథా రచయిత పద్మనాభన్.

అడియాసలూ, ఆత్మనిందలూ, అలసటలూ కలగలిసిన భారాన్ని మోస్తోన్న పట్టణ ప్రజలకు ముఖ్యంగా యువకులకు కథల్లో స్థానం కల్పించిన రచయిత ఎం.టి. వాసుదేవన్ నాయర్. తన కథల ద్వారా ఒక క్షుభితమనస్సుని దర్శింపజేయగల దిట్ట, ద్రష్ట ఎం.టి. శిథిలమయిపోతోన్న నాయర్‌ల సమష్టి కుటుంబాల నేపథ్యంలో వళ్లువనాడన్ ప్రాంత గ్రామీణ జీవన దృశ్యాల్నీ, వాళ్ల ఆంతరిక భావనల్నీ కథల్లో చొప్పించిన వాడు ఎం.టి. కథల్లో ఆవిష్కరించబడే భావాలను ఇమేజీలుగా తీర్చిదిద్దే రహస్యం నాయర్ కథలకు కవితాత్మకతను అద్దింది. మలబార్ ముస్లిమ్‌ల జీవితాలను కథల్లోకి ఆహ్వానించిన రచయిత ఎన్.పి. మహమ్మద్. కోవిలన్ మిలిటరీ కథా రచయితగా పేరు పొందిన విలక్షణ రచయిత. ఇతను మరోమారు ఆకలీ, కామం మొదలైన



మానవుడి ఆదిమ ప్రేరణల్ని కథా గతం చేసిన రచయిత. సైనిక కథా రచయితలుగా ముద్రపడిన రచయితలు మరో ఇద్దరున్నారు. వీళ్లు పారప్పురత్తు, నందనార్‌లు. రాజలక్ష్మి గొప్ప రచయిత్రి. అంతర్ముఖురాలు. స్త్రీ జీవితాన్ని బాగా ఆవిష్కరించిన రచయిత్రి. ఎన్. మోహనన్ రచనల్లో ప్రచ్ఛన్నమైన రాజకీయ స్పృహ ప్రతిఫలిస్తూ వుంటుంది.

మలయాళ కథా వికాసంలో నాల్గవ ఘట్టం ఆధునికతా ప్రభావంతో మొదలైంది. అరవయిల్లో ఆరంభమైన ఈ దశ మలయాళ కథా సాహిత్యంలో మళ్లీ భావుకతని బాగా పాదుకొల్పిన కాలం. మాధవికుట్టి ఆధునిక స్పృహతో అరంగేట్రం చేసి మలయాళ కథకు కొత్త కోణాన్ని సమకూర్చి పెట్టింది. సాంఘికమూ, సమకాలీనమూ అయిన వర్తమాన విలువల్ని సమర్థవంతంగా ఎదిరించిన కాలమిది. ఈ తరం రచయితల ఆధునికతకు ప్రధాన కారణం వీళ్ళంతా నగరవాసులు కావడం. నగరాలు కేంద్రాలుగా వున్న ఆధునిక సమాజంలో మానవత్వానికి కల్గుతోన్న క్షతిని ఒక శక్తివంతమైన అనుభవంగా స్వాయత్తం చేసుకుని రచనలు చేసిన వాళ్ళు మాధవికుట్టి, ఓ.వి. విజయన్, కాక్కనాడన్, ఎం. ముకుందన్ సేతు, పునత్తిల్ కుంజబ్దుల్ల ప్రభృతులు. స్త్రీ మనసు తాలూకు నిగూఢమైన అంతస్సంఘరణల్ని తన మనో విశ్లేషణాత్మక కథలద్వారా ఆవిష్కరిస్తూ వచ్చిన మాధవికుట్టి క్రమేపీ మానవ జీవన సంక్లిష్టతల్ని చిత్రించసాగింది.

ఓ.వి. విజయన్ బహుముఖ ప్రతిభాశాలి అయిన కథా రచయిత. చిన్నపాటి అనుభవాల్ని సైతం అగాథమైన కథాశిల్పంగా మార్చే విజయన్.... తన కథాలోకంలో దాచేస్తే దాగని హాస్యాన్ని ఫిలసాఫికల్ కాంతిని, ఆధ్యాత్మికతని మేళవింపచేశాడు. మనిషికీ, ప్రకృతికీ వున్న చిరకాల సంబంధం విజయన్ కథలకు అలంకారమై భాసిల్లింది. జీవితం హేతురహితమైన పీడకలగా భావించే కథలు సేతువి. వి.కె.ఎన్. సాంకేతికంగా ఈ కాలం రచయితల్లో ఇమడని వ్యక్తి. మలయాళ కథలకు భౌతిక పార్శ్వాన్ని కల్గజేసిన రచయిత ఆనంద్. తెల్లవారి లేచింది మొదలు మనమంతా దేనికో ఎరగా మారుతోన్న వైనం, నిత్యం మనం ఎదుర్కొనే సంక్షోభాలు, సవాళ్లు ఆనంద్ కథలకు ముఖ్యమైన అంశాలుగా పనిచేశాయి.

ఇంతేగాక విలక్షణమైన మరొక ధార ద్వారా మలయాళ కథ సమాంతరంగా వికసించడం మొదలైందీ ఈ రోజుల్లోనే! శక్తివంతమైన సాంఘిక స్పృహతో కథలు రాసిన ఎం. సుకుమారన్ ఈ మార్పుకి అగ్రభాగాన నిలిచిన రచయిత. సి.ఆర్.

పరమేశ్వరన్, యు.పి. జయరాజ్, పి.కె. నాణు మొదలైన కథా రచయితలు ఈ సమాంతర కథా సాహిత్యాన్ని ముందుకు నడిపించారు. దీన్ని తీవ్రతరం చేసిన వ్యక్తి పట్టత్తువిళ కరుణాకరన్.

మలయాళ కథా సాహిత్యంలో అయిదవదీ, చివరిదీ అయిన దశ ఉత్తరాధునికతకు సంబంధించిన కలం. సి.వి. శ్రీరామన్, వత్సల, వైశాఖన్, వేణుగోపాలన్ నాయర్, ముందూర్‌లు ఇప్పటివాళ్లు. ఆధునిక మలయాళ కథల్లో దాదాపు కనుమరుగైపోయిన కథా పాత్రలూ, జీవన సందర్భాలూ శ్రీరామన్, వైశాఖన్ కథల్లో చోటు చేసుకున్నాయి. జీవితంలోని సంక్లిష్టతల్ని ప్రచ్ఛన్నమైన లాలిత్యంతో ఎదుర్కోవడానికీ, అనుభవ తీక్షణతను భ్రమ, కల్పన తాలూకు వెన్నెలతో మరుగుపుచ్చడానికీ ఈ కథా రచయితలు నిరంతరం శ్రమిస్తున్నారు. అయితే ఇతర కాలంలో కథావేదికమీద మణిమకుటధారులై నిలిచిపోయిన రచయితల్లాగా ఈ చివరి దశకు చెందిన వాళ్ళు ఇంకా పెద్దగా పేరుప్రఖ్యాతులు సంపాదించలేదు. ఈ వర్తమాన కథా రచయితల జాబితా సుదీర్ఘమైంది. వీళ్లలో తమవైన ముద్రలతో సారా జోసఫ్, ఎన్.ఎస్. మాధవన్, వి.పి. శివకుమార్, సి.వి. బాలకృష్ణన్, కొచ్చుబావ, అక్బర్ కక్కట్టిల్, మానసి, అషితలు రచనా వ్యాసంగం కొనసాగిస్తున్నారు.

మలయాళ కథా సాహిత్యంలోని మొదటి, మూడో దశలపై ఆంగ్ల సాహితీ ప్రభావమూ, రెండో దశపై చెకోవ్, మొపాసాల ముద్రలూ, నాల్గో దశలో ఫ్రెంచ్ సాహిత్య ఛాయలూ వుండి కథలకు నిండుదనాన్ని కల్గించాయి. ప్రస్తుత దశలోని ఉత్తరాధునికతపై ప్రపంచంలోని వివిధ పార్శ్వాల సాహిత్యాలూ ప్రభావాన్ని చూపాయి. మొదటిదశలోని కథల్లో మానవ జీవితం ఉపరితలమ్మీదే కనిపిస్తుంది. రెండోదశ సామాజిక చేతనకు పట్టంకట్టి కథాగమనంలో స్పష్టమైన మార్పుని తీసుకొచ్చింది. మూడోదశ మనిషి వైయక్తిక జీవితంలోకి తొంగిచూసింది. నాల్గోదశ ఈ ఆంతర్యాలకూ, అంతరంగాలకూ ఉచ్ఛస్థితిని కల్గించింది. ఐదవది కలగూరగంపలాంటిది. మొత్తం మీద నూట ఐదేళ్లుగా అప్రతిహతంగా ముమ్ముందుకు కొనసాగుతోన్న మలయాళ కథాప్రవంతి ఇది.

(మూలం : కే. ఎస్. రవికుమార్).

-విపుల నవంబర్ 2000



# నూరేళ్ల బెంగాలీ కథ

సృజనాత్మక సాహిత్య ప్రక్రియ అయిన కథానికను ఆంగ్ల, యూరోపియా సాహిత్యాల్లో స్పష్టంగా నిర్వచించడం కోసం ప్రఖ్యాత విమర్శకుడు మాథ్యూస్... 'షార్ట్ మరియు స్టోరీ' అనే రెండు పదాల మధ్య ఉద్దేశ్యపూర్వకంగానే హైఫెన్‌ను ఉపయోగించాడు. బెంగాలీ సాహిత్యంలో రవీంద్రనాథ్ టాగూర్ తను ప్రారంభ దినాలలో 1893 వరకు రాసిన కథానికల పుస్తకానికి 'ఛోట్‌గల్ప్' (కథానిక) అని పేరు పెట్టాడు. ఇతనికన్నా ముందు రాసిన కథా రచయితల్లో స్వర్ణకుమారీదేవి, నాగేంద్రనాథ్ గుప్తలు ప్రముఖులు. అప్పట్లో కథానికకు బెంగాలీ భాషలో గల్ప్, క్షుద్రగల్ప్, క్షుద్రకథా మొదలైన రకరకాల పేర్లు వుండేవి.

నాగేంద్రనాథ్ గుప్త తన కథల్ని 'సంగ్రహ్' అనే పుస్తకరూపంలో 1892లో వెలువరించాడు. స్వర్ణకుమారీదేవి కూడా తన కథల పుస్తకాన్ని 17-8-1892 నాడు ప్రచురించింది. ఈమె రవీంద్రనాథ్ టాగూర్‌కి అక్కయ్య. ఈమె ప్రకటించిన పుస్తకం పేరు 'నవ్‌కాహినీ వా ఛోట్‌ఛోట్ గల్ప్' (కొత్త కథలు లేక చిన్నచిన్న కథలు). ఈమె తన కథల శిల్ప విషయంలో కాస్త జాగ్రత్త పడింది. స్వర్ణకుమారీదేవి తన బాల్యంలో జ్యోతిరింద్రనాథ్ (రవీంద్రుని అన్న) ద్వారా అనేకదేశవిదేశాల కథలను వినేది! బహుశా ఆనాటినుండే ఆమె బెంగాలీలో కథలు రాయడం ఆరంభించి వుంటుంది. స్వర్ణకుమారీ దేవి తన కథల్లోని విభిన్న సన్నివేశాల్లో అమలిన శృంగారాన్ని పోషించింది. అయితే పరిసరాల చిత్రీకరణలో వైఫల్యం, కథావస్తు నిర్వహణలో శైథిల్యం, ఆకస్మికమైన అతి

నాటకీయత మొదలైన అంశాలు ఈమె కథల్లోని శిల్పానికి ఎంతో నష్టాన్ని కల్గించాయి. అయినప్పటికీ 'గహన' లాంటి శిల్ప నైపుణ్యం కల్గిన కథలు కొన్ని ఉన్నాయి.

నగేంద్రనాథ్ గుప్త ఎన్నో కథలు రాసినప్పటికీ శిల్పం విషయంలో బలహీనుడే! ఒకింత గ్రాంథిక భాషతో చిన్నచిన్న వాక్యాలు రాసేవాడు. ధార బాగానే వుండేది. ఆభిజాత్యంగల రాజులు, రాణుల జీవితాలు, పరిచారికలు, పతితులు నగేంద్రనాథ్ కథల్లో ముఖ్యపాత్ర ధారులు. చారిత్రిక సౌందర్యం, మానవుల విపరీతాసక్తులు, డిటెక్టివ్ కథల్లో కన్పించే ఉత్కంఠవంటి అంశాలవలన అతని కథల్లోని వర్ణణాకౌశలం పాఠకలోకాన్ని బాగా ఆకట్టుకుంటుంది. దీనికి మంచి ఉదాహరణ 'చరి నా బాహాదురి' అనే కథ. నగేంద్రనాథ్ గుప్త తన తర్వాతికాలంలోని ఎందరెందరో అపరాధ పరిశోధక రచయితలకు ఒక రకంగా మార్గదర్శి. అతడు తన రహస్యకథల మాధ్యమం ద్వారా ఆధునిక బెంగాలీ కథా సాహిత పూర్వార్థంలో ఒక ఇంప్రెషన్ కల్గించాడు. దీన్ని మనం కథకు సంబంధించిన 'సింగిల్ ఇంటెన్సు ఇంప్రెషన్' గా పరిగణిస్తున్నాం. ఈ రకమైన ఇంప్రెషన్ ఉన్నఫలంగా బెంగాలీలో తలెత్తడానికి కృషి చేసిన రచయిత నగేంద్రనాథ్ గుప్త. అసలు ఈ రకమైన కథలకు పునాదులు ఆధునిక కథా సాహిత్య ప్రారంభకుడైన ఎడ్గార్ ఎలెన్‌పోలో కనిపిస్తాయి.

అయితే ఈనాటి డిటెక్టివ్ కనిపించే శాస్త్రీయ పద్ధతి మాత్రం నగేంద్రనాథ్ కథల్లో కన్పించదు. నగేంద్రనాథ్ కొన్ని ప్రేమ కథలు కూడా రాశాడు. ఆ కథల్లో ఆంగ్ల సాహిత్యంలోని ప్రణయఛాయలు గోచరిస్తాయి. ఇంకా అనేక విషయాలను కేంద్రంగా తీసుకుని అతను అనేక కథలు రాశాడు. నగేంద్రనాథ్ గుప్త గారి దైనందిన జీవితానుభవాలకూ, అతని కల్పనాశక్తికీ, కావ్యదృష్టికీ ఈ కథలు చక్కటి దృష్టాంతాలు.

తరువాతి కాలంలో చెప్పుకోదగ్గ రచయిత ప్రభాత్‌కుమార్.

కథానిక (ఛోట్‌గల్ప్) అనే పదాన్ని రవీంద్రనాథ్ టాగూరు మొట్టమొదటిసారిగా బెంగాలీలో ప్రయోగించినప్పటికీ, కథా శిల్పం, కథా వస్తాది లక్షణాల గురించి మాత్రం అతడానాడు ఎక్కడా ప్రస్తావించలేదు. పైగా కథానిక (ఛోట్‌గల్ప్) అనే పదాన్ని ఆ తర్వాత తన ఏ కథా సంకలనానికీ పెట్టలేదు. విచిత్రకథా, కథా చతుష్టయ్, కథా దశక్, గల్ప్, గల్ప్ గుచ్ఛ్... ఇవీ రవీంద్రుని ఆ తర్వాతి కథాసంకలనాల పేర్లు. కథ లేదా కథానిక అనే పదం ప్రత్యేక లక్షణాలతో కూడిన సాహిత్య ప్రక్రియగా ఆనాటికి



ఇంకా రూపుదిద్దుకోలేదు. అయితే హితవాది పత్రికలో ఆనాడు కొన్ని కథలు అచ్చయ్యాయి. వీటి రచనా పద్ధతి చక్కని శిల్ప నైపుణ్యాన్ని పుణికి పుచ్చుకుంది. ప్రపంచ ప్రఖ్యాతకథా రచయితల శిల్ప విన్యాసానికి ఏమాత్రం తీసిపోనిది ఈ కథల్లోని శిల్పం. రవీంద్రనాథ్ తను ప్రథమార్థంలో రాసిన కథా రచనల గురించి ఇక్కడ కొంత చెప్పుకోవడం సముచితంగా వుంటుంది. అతని మొదటి కథా ప్రయత్నం 1877 నాటి 'భిఖారిణి' భారతి పత్రికలో ప్రచురించబడింది. నవలలోలాగా అధ్యాయాలవారీగా విభాగింపబడిన ఈ కథ విషాదభరితమైన రొమాంటిక్ కథ. కానీ కథకి అవసరమైన వేగం, సన్నివేశాలు అంతగాలేవు. కాకపోతే కథారూపంలో వుంది. రచనారీతి, వాతావరణం, భాషలో రొమాంటిక్ పద్ధతులు ఇవన్నీ కలగలిసి దీర్ఘసమాస భూయిష్టమైన బెంగాలీ గ్రాంథిక భాషా రీతిని తోసిరాజని ఈ కథలు సరళమైన సుబోధకమైన సరికొత్త భాషని ఆవిష్కరించాయి. 1884లో రవీంద్రుడు 'రాజ్‌పథేర్‌కథా', 'ఘాటేర్‌కథా' రాసినప్పుడు కూడా కథకు సంబంధించిన శిల్పం అతనికింకా ఒంటపట్టలేదు. ప్రారంభంతోనే కథలోకి వెళ్లిపోవడం, ఏదో అవసర సన్నివేశాన్ని మనసులో వుంచుకొని రాయడం, తీక్షణమైన ముగింపుతో కథని ఆపడం, మానవ స్వభావాల, సామాజిక వ్యవస్థల ఏ అసంగతాల గురించో, సమస్యలపట్లో సూచనలు ఇవ్వడం, ఏదో ఒక ప్రత్యేక కాలఘట్టాన్ని సంభాషణారీతులతో ఉన్నతీకరించడం మొదలైన కథాశిల్ప లక్షణాలు పందొమ్మిదో శతాబ్ది చివరి రెండుమూడు దశాబ్దుల్లోని ప్రసిద్ధ కథా రచయితల రచనల్లో దాదాపుగా కన్పించాయి. పోస్టుమాస్టర్, గిన్ని, వ్యవధాన్ మొదలైన కథలు, అందుకు ఉదాహరణలు. ఆ కథల్లో బ్రహ్మాండమైన సంభాషణలతో కూడిన ఇతివృత్తాలు లేకపోవచ్చు కాని మానవ స్వభావం గురించీ మానవత్వం గురించీ కొన్ని సామాజిక సమస్యల గురించీ ఆ కథల్లో చిన్నచిన్న బొమ్మలైనా పాఠకుల కళ్లకి కన్పిస్తాయి. సన్నివేశ కల్పనకన్నా అక్కడ భావావేశం ముఖ్యం.

బెంగాలీ విమర్శకుడొకరు మొదటి ఏభై సంవత్సరాల కథా చరిత్ర గురించి రాస్తూ "విదేశీ కథలతో మొదటి రోజుల్లోని బెంగాలీ రచయితలకు సాన్నిహిత్యం వున్నప్పటికీ, బెంగాలీ కథతనదైన సొంత పద్ధతిలోనే పురుడుపోసుకుంది" అంటాడు. ఏమైనా ఆధునిక కథా శిల్పానికి సంబంధించిన మూలాలు మన ప్రాచీన కథా సాహిత్యంలో లేవన్నది నిర్వివాదాంశం. ఈ శిల్పకౌశలాన్ని మనం విదేశీ కథల్లోంచే స్వీకరించాం. అనుభవం

మాత్రం ఖచ్చితంగా మనదే! రవీంద్రనాథుని విషయంలోనూ అదే జరిగింది. 'దేనా పాఓనా' అనే కథలోని సమస్య మన సమస్యే! ఆధునిక కథ పుట్టిన కాలానికే రచయితలు ప్రపంచకథా సాహిత్యం చదివిన దాఖలాలున్నాయి. రవీంద్రుడు దేశదేశాల కథల్ని చదివాడు.

రవీంద్రుని కథా రచన కాలాన్ని రెండు విభాగాలుగా భావిస్తే...పూర్వార్థంలో అతను రాసిన కథలు హితవాది, సాధన, భారతి పత్రికల్లో అచ్చయ్యాయి (1891-1911). 1914 నుంచి 1917 ల మధ్య అతను రాసిన కథల్లో శిల్పపరమైన, వస్తుగతమైన మార్పులు చోటు చేసుకోవడం గమనించగలం. ఆ తర్వాతి కాలంలో రవీంద్రుడు కథలు తక్కువగా రాశాడు. పోస్ట్‌మాస్టర్, ఏక్‌రాత్రి, సమాప్తి, అతిథి, సభా మొదలైన కథల్లో మనిషి నిస్సంగత్వంలోని వేదన చిత్రీకరించబడింది. రవీంద్రుడు తన కథల్లో ప్రకృతికీ, మనిషికీ సమప్రాధాన్యం కల్పించాడు. నదీనదాలూ, పంటపొలాలు, పల్లెపట్టులు, కొండకోనలు...ఒకటేమిటి సమస్త చరాచర ప్రపంచానికి అతని కథలు తెరలు తీశాయి. కొన్ని కథలు వ్యక్తినిష్టంగా సాగుతాయి. వీటిలో ప్రేమ ప్రధాన విషయం. భారతీయ జీవన విధానంలో ఒక్కటైన కుటుంబ వ్యవస్థనీ చిత్రీకరించిన కథలున్నాయి. ఇలాంటి కథల్లో భ్రాతృప్రేమ, తల్లిప్రేమ ప్రధానంగా గోచరిస్తాయి. ఏదేమైనా తొంభయిల నాటి కథోత్పత్తికి మూల కారకుడైన రవీంద్రుడు వస్తుపరంగానూ, విషయవైచిత్రిరీత్యానూ, రచనా విధానదృష్ట్యానూ, భాషా పరిణతి ప్రకారంగానూ సాధించిన విజయాలు అనన్యసామాన్యమైనవి.

తరువాత త్రైలోక్యనాథ్ ముఖోపాధ్యాయ్ కొన్ని కథల్నీ, కథా సంపుటాల్నీ ప్రచురించాడు. అయితే ఇతని కథల్లో ఆధునిక కథా లక్షణాలు అంతంత మాత్రంగానే వుంటాయి. పౌరాణిక కథల్లా సాగిపోతాయి త్రైలోక్యనాథుని కథలు.

ప్రభాత్‌కుమార్ ముఖోపాధ్యాయ్ జనప్రియ కథలెన్నో రాశాడు. బెంగాలీ సమాజంలోని గ్రామీణ జీవనాన్నీ, నగరం బతుకుల్నీ పట్టుకొన్న ఇతని కథలు అక్కడి సాహిత్యంలో పట్టుగొమ్మలు. అంతేకాదు విదేశీ కథల నేపథ్యంతో రాసిన కథల్లోనూ ప్రభాత్‌కుమార్ అగ్రగామి. అతని ప్రసిద్ధ కథలు 'మాస్టర్ మహాశయ్, రసమయివార్' రసికతల్ని తీసుకోండి. పాఠకుల్ని సమ్మోహితుల్ని చేసే రచనా ఫణితికి అవి ఎత్తిన దీపాలు. విపరీత ఉత్కంఠకి ఉదాహరణలు. నానా దేశాల నేపథ్యాల్లో రాసిన ఇతని



కథలు ఆ తర్వాతి బెంగాలీ రచయితలు అన్నదాశంకర్‌రాయ్, ప్రమథ్‌చౌధురిలకు మార్గదర్శకాలు. సురేంద్రనాథ్ మజుందార్ ఛోట్‌ఛోట్‌గల్ప్ (1915), కర్మయోగీర్ టీకా (1918) ఉల్లేఖించదగిన సంపుటాలు.

పరశురామ్ త్రైలోక్యనాథుని కథల్లోని పౌరాణికతకి బదులు కాలోచిత భాషని ప్రయోగించి మంచి కథలు రాశాడు. 'విరించి బాబా' పరశురామ్‌కి విస్తృతమైన ప్రసిద్ధిని సంతరించిన పుస్తకం. అందులో రచయిత తీక్షణ దృష్టి రూక్షమైన రచనా విధానం, ఐతిహాసిక స్పృహతో కలిసిన వ్యంగ్యవైభవం ముప్పేటలా అల్లుకుపోతాయి. రెండో ప్రపంచయుద్ధం అనివార్యంగా తీసుకొచ్చిన కడగండ్లకి విచలితుడై 'గామానుష్ జాతిర్ కథా' రాశాడు.

ఇటు పరశురామ్ కథాసాహిత్యంలో కలికితురాయిగా మారుతున్న కాలంలోనే కొంచెం అటూ ఇటూ సబూజ్ పత్రికా సంపాదకుడైన ప్రమథ్‌చౌధురి ఫ్రెంచి కథల అనువాదం ప్రకటించాడు. స్త్రీని కేంద్రంగా చేసుకున్న సౌందర్య చేతన అతని కథలకు జీవధాతువుగా పనిచేసింది. రొమాంటిక్‌గా మొదలెట్టిన కథని యాంటీ రొమాంటిక్‌గా ముగించడం ప్రమథుని కథల్లో కన్పించే మరో విశేషం. కానీ కొన్ని కథలు వ్యాసాల్లా వుంటాయి.

శరత్ కళ్లారా చూసినవే రాస్తాడు. ప్రమథ్ చౌధురిలో కల్పనాశక్తి కట్టలుతెంచుకుంటే ఇతని కథలు కళ్లు తెరుచుకుంటాయి. భావావేశంతో అశ్రుసిక్తాలవుతాయి. ఇతని మందిర్, కాశీనాథ్‌లు మంచి కథలు. ఏమైనా శరత్ చంద్రికలు కథావీధిలో కాక నవలాకాశంలోనే బాగా పరిమళించాయి. ఇంకా ఆ కాలంలోనే శ్రీశచంద్ర మజుందార్, సుబోధ్‌చంద్ర మజుందార్, దేవేంద్రకుమార్ రాయ్, దీనేశ్‌చంద్రసేన్, జలంధర్‌సేన్, అబ్దుల్ ఉద్దు ప్రభృతులు గ్రామజీవితాన్ని నేపథ్యంగా తీసుకుని కథలు రాశారు. ఆధునిక నాగరికతా ప్రభావంతో మారుతున్న పల్లెసీమల్ని రికార్డు చేశారు. వీళ్లంతా కథా శిల్పంకన్నా మిన్నగా వస్తువు మీద దృష్టిసారించిన రచయితలు. అబ్దుల్ ఉద్దు, జలంధర్ సేన్‌లు మాత్రం ముస్లిమ్ జీవితాలకు తమ కథల ద్వారా స్థానం కల్పించారు.

మరోవేపు డిటెక్టివ్ కథా సాహిత్యం సైతం సమాంతరంగా పయనించడం బెంగాలీలో కనబడే అంశం. భువన్‌చంద్ర ముఖోపాధ్యాయ, ప్రియనాథ్ ముఖోపాధ్యాయ, పాంచకడీదేవ్‌లు ఈ రకమైన సాహిత్యాన్ని సృష్టించారు. సాహితీ విలువలకన్నా ఈ

సాహిత్యంలో ఉత్కంఠే ప్రధాన విషయం. ఆ తర్వాత హరిసాధన్, హేమేంద్రకుమార్ ముఖ్యంగా శరదిందు బందోపాధ్యాయ్‌లు డిటెక్టివ్ సాహిత్యంలో రాణించిన రచయితలు. నిన్న మొన్నటి వరకూ ఆ మార్గంలో నడిచిన మరో ప్రసిద్ధ రచయిత సత్యజిత్‌రే.

రవీంద్రుని కథలతోపాటు అతని సాహిత్యాన్నీ, దృక్పథాన్నీ వ్యతిరేకించిన బృందం ఒకటి బెంగాలీలో కన్పిస్తుంది. వీళ్ళంతా సాహిత్య అనే పత్రికలో రచనలు చేసేవాళ్ళు. తర్వాత భారతి పత్రికద్వారా మరి కొందరు ఆ బృందంలో చేరారు. రవీంద్రుడు ఒకవైపు సబూజ్ పత్రికలో రాస్తున్నప్పుడే వీరు నారాయణ్ పత్రిక ద్వారా మరింత బలపడ్డారు. అయితే వీళ్లను బెంగాలీ పాఠకులు క్రమేపీ మరిచిపోయారు. కారణం వీళ్ల కథల్లో కళాకౌశలం శూన్యం. రవీంద్రుడు, శరత్, ప్రమథ్‌చౌధురి... ఈ ముగ్గురూ విశ్వసాహిత్యంతో నిత్యపరిచితులు. ఫ్రెంచి, డచ్, నార్వే, జర్మన్ కథల్ని బెంగాలీలకు చేరవేశారు. మానవతావాదాన్ని చేరదేశారు. పతిత స్త్రీజనోద్ధరణ కోసం కొన్ని కథలు రాశారు. ప్రథమ ప్రపంచ యుద్ధం తర్వాత వంగీయ ముసల్మాన్ పత్రిక, ముస్లిమ్ భారత్ పత్రికలు ముస్లిముల జీవన విధానాన్ని వస్తువుగా చేసుకొని రాసిన కథల్ని అచ్చువేశాయి. నజ్రుల్ ఇస్లామ్ వంగీయ ముసల్మాన్ పత్రిక ద్వారానే పరిచయమయ్యాడు. సీతాదేవి, సునీతదేవి, జ్యోతిర్మయా దేవిల్లాంటి రచయిత్రులు కథా అరంగేట్రం చేశారు.

ఆ తర్వాత జగదీష్‌గుప్త బెంగాలీ కథాసాహిత్యాన్ని మలుపు తిప్పగలిగాడు. జీవితానికి అన్ని వైపులా వున్న పార్శ్వాల్ని చిత్రించడంలో సాఫల్యం పొందిన రచయిత జగదీష్.

రెండో ప్రపంచ యుద్ధానంతర దారుణ పరిస్థితులు ఎంతోమంది రచయితల్ని బయటకు తెచ్చాయి. నజ్రుల్ ఇస్లాం 'బిద్రోహీ తరుణ్' చెప్పుకోదగ్గ కథ. 1923లో మణీంద్రలాల్ బసు రాసిన మొదటి కథా సంపుటి 'మాయాపురి' వచ్చింది (1923). కల్లోల్ అనే పత్రిక ద్వారా బెంగాలీకథా సాహిత్యం మళ్ళీ ఒక్కసారి ఒళ్లు విరుచుకుని వెల్లివెరిసింది. ఫ్రాయిడ్, యూంగ్, మార్క్స్‌లను చదివిన కొత్తతరం పాత పద్ధతులపై ధ్వజమెత్తింది. శైలజానంద్ ముఖోపాధ్యాయ్ సంతాలీల జీవన విధానాన్ని కథల్లోకి ఎక్కించాడు. మాండలిక భాషా ప్రయోగంలో ఇతనే ప్రథముడు. ఈ లక్షణాన్ని ఆ తర్వాత కొనసాగించిన వారు తారాశంకర్ బందోపాధ్యాయ్, మానిక్‌చంద్‌లు.

'కల్లోల్' పత్రికద్వారా ప్రఖ్యాతుడైన కథా రచయిత ప్రేమేంద్ర్ మిత్ర. సమాజంలో చిన్న చూపుకి గురైన మనుషులు, దిగువ మధ్యతరగతి జనాలు, పట్టణ ప్రజలు,



పతితులు, ఆవారాగాళ్లు... అందరూ అతని కథల్లో కన్పిస్తారు. బుద్ధదేవ్‌బసు మరో సమర్థుడైన కథా రచయిత. నజ్రుల్ ఇస్లామ్, మణీంద్రలాల్‌ల కథాసంవిధానం ఇతనిలో గోచరిస్తుంది.

సుమారుగా అప్పుడే తారాశంకర్ బందోపాధ్యాయ, విభూతి భూషణ్ బందోపాధ్యాయ్‌లు.... కొంతకాలం తర్వాత మానిక్‌చంద్ బందోపాధ్యాయ్‌లు కన్పిస్తారు. తారాశంకర్ 'నారీ ఓ నాగినీ' వంటి కథలు గొప్ప కథలు. పశువుల్లోని మానవత్వాన్నీ, మనుషుల్లోని పశుప్రవృత్తినీ గొప్పగా విశ్లేషించగలడాయన..

ప్రకృతి రమణీయత విభూతిభూషణ్ కథల్లో బాగా స్పష్టమవుతుంది. మానిక్‌చంద్‌లో వాస్తవికతలోని కాఠిన్యం కన్పిస్తుంది. తారాశంకర్, బనఫూల్, విభూతిభూషణ్, ప్రబోధ్‌కుమార్ సన్యాల్‌లు యుద్ధ వాతావరణాన్ని కథల్లో చిత్రిస్తూ కరువు కాటకాల గురించి రాస్తూ ఆ రోజుల్లో మొత్తం బెంగాలీ సంఘాన్ని కథల్లోకి కుదించారు. నారాయణ్ గంగోపాధ్యాయ్, సుబోధ్ ఘోష్‌లాంటి ఎందరో రచయితలు దుర్భిక్ష పరిస్థితుల్ని కథలుగా మలిచారు. బెంగాలీకథ ఈ కాలంలోనే తీక్షణ విశ్లేషణతో, సంఘటనా విన్యాసంతో మానిక్ బందోపాధ్యాయ్ అసమాన శిల్పసామర్థ్యంతో కొత్త పుంతలు తొక్కింది. చాలా పర్యాయాలు కేవలం ఆదర్శవాదాల కృత్రిమ యాంత్రికతతో శిల్పం కొరవడినా, మానిక్ తన కథల ద్వారా బతుకులోని అన్ని ద్వారాలూ తెరిచాడు. అయితే మానిక్ కన్నా ముందు ఈ మార్గంలో నడిచిన రచయిత సుబోధ్‌ఘోష్. ఇద్దరినీ నలభయిల్లో జ్యోతిరింద్ర, సంతోష్ కుమార్ ఘోష్, నరేంద్రమిత్ర, నారాయణ గంగోపాధ్యాయ్‌లు అనుసరించారు. జ్యోతిరింద్ర చైతన్య స్రవంతి పద్ధతిలోనూ కొన్ని కథలు రాశాడు. నలభయిల్లోనే పేరు తెచ్చుకున్న మరో కథా రచయిత రమాపద్‌చౌధురి. ఇతని 'భారత్‌వర్ష్' కథ యుద్ధానంతర పరిస్థితులకి చక్కటి దృష్టాంతం. సమరేశ్‌బసు...తన అనుభవాలన్నింటినీ కథలుగా తీర్చిదిద్దాడు. బిమల్‌కర్ యాభైయిల్లో వచ్చి నిలదొక్కుకున్న గొప్ప రచయిత. ఇతడు కథానిక కొత్త రీతుల గురించి ఆందోళన సలిపాడు. 'ఏఇ దశకేర్‌గల్ప్' (ఈ దశాబ్ది కథలు) పేర ఓ అద్భుత కథా సంకలనం వేశాడు. మనుషులకీ మనుషులకీ వుండాల్సిన సంబంధాలు, మనుషులకూ సమాజానికీ వుండవలసిన బంధాలు... బిమల్‌కర్ రచనల్లో బలంగా తొంగిచూస్తాయి. యాభై, అరవయిల్లో కీర్తి కిరీటాలు ధరించిన మరికొందరు సునీల్ గంగోపాధ్యాయ్, శ్యామల్ గంగోపాధ్యాయ్, ప్రఫుల్లరాయ్,

మతినంది, సయ్యద్ ముస్తఫా సిరాజ్, బుద్ధదేవ్‌గుహ, నవనీతా దేవ్‌సేన్, దివ్యేంద్ పాలితులు.

బెంగాలీ కథా శిల్పుల్లో కమల్‌కుమార్ మజుందార్ కూడా ప్రముఖుడు. ఆదివాసీ జీవితాల్లోకి తొంగిచూసి వాళ్ల వున్నతికే అంకితమై రచనలు చేస్తోన్న మహాశ్వేతాదేవి మరో గొప్ప రచయిత్రి. ఆమె రాసిన 'సనదాయినీ, బేహులా, ద్రౌపది, నూన్' లాంటివి అత్యుత్తమ కథలు. ఆశాపూర్ణాదేవి ప్రఖ్యాతినొందిన రచయిత్రి. శేఖర్‌బసు, కవితాసింహ్ మొదలైన ఎంతోమంది కథా రచయితలు, రచయిత్రులు బెంగాలీ సాహిత్యాన్ని అనునిత్యం సుసంపన్నం చేస్తున్నారు.

*(మూలం : ఉజ్వల్‌కుమార్ మజుందార్)*

*- విపుల అక్టోబర్, 1999*



# తెలుగు, మలయాళ భాషల్లో ఆలుమగల సామెతలు - ఒక పరిశీలన

అనాదిగా అనుభవమే పునాదిగా జానపద సాహిత్య వియత్తలంలో అజరామరంగా వెలిగిపోతున్న రెండు ప్రక్రియలు సామెతలూ, పొడుపు కథలూ, ఇవి పల్లీయుల జిహ్వాగ్రాల నుంచి జారిపడిన పసిడి పలుకులు. జానపద వాఙ్మయ ప్రాపంచిక జ్ఞానానికి తెరిచిన కిటికీలు-ఎత్తిన దివిటీలు. అక్షరలక్షలు చేసే అమూల్య సత్యాలు-అనర్ఘ రత్నాలు. నిరక్షర కుక్షుల అనుభవాల పొతరలకు నికషోపలాలు-ప్రతిభాఫలాలు. 'పొయెట్రీ ఈజ్ ది స్పాంటేనియస్ ఓవర్‌ఫ్లో ఆఫ్ ద పవర్‌ఫుల్ ఫీలింగ్స్" అన్నట్లు సామెతలు పల్లీయుల గుండె లోతుల్లోంచి దూకిన శక్తిమంతమైన, ఆలోచనాత్మకమైన తరతరాల అనుభవాల, అనుభూతుల, ఆలోచనల జలపాతాలు. గ్రామీణుల మేధో గగనంలో తళుక్కున మెరిసిన రమణీయ శంపాలతలు.

మానవ జీవన స్పృహలేని మరో ఇతర సాహిత్య ప్రక్రియ ఏదైనా ఉంటే ఉండవచ్చు నేమోగాని 'రవిగాంచనిది కవిగాంచును' అన్నట్లు మనిషి మనికితోనే ఉనికి ఏర్పరుచుకొన్న విశిష్ట ప్రక్రియ మాత్రం సామెతే! ప్రతి సామెతా పుటంపెట్టిన సత్యం. పులుగడిగిన ముత్యం. ప్రతి మనిషికీ శ్వాసించడం ఎంత అవసరమో, సహజమో, అప్రయత్నమో పల్లీయులకి సామెతలతో భాషించడం కూడా అంతే ప్రాణావసరమూ, సహజమూ, అప్రయత్నమూ.

సామెతకి సాంద్రత ఎక్కువ. ఇవి 'వీలెరిగిన మాటలు-కీలెరిగిన వాతలు'. సందర్భోచితమైన రాతలు. సామెతకు పొదుపు ఎక్కువ. సామెతల స్రష్టలైన జానపదులకు శబ్దం మీద అదుపు ఎక్కువ. అందువల్లే సామెత కల్గించే కుదుపూ అధికం. ఆయా కాలాల్లో ఆయా సన్నివేశాలకు అనుగుణంగా ప్రజాకవుల నోట వెల్వడిన చాటువులు, సామెతలు ఇవి విభిన్నాలోచనల సమాహారాలు-జానపద శారదకు కైసేసిన సుమహారాలు. సామెత-నిర్వచనం, సామెత-లక్షణాలు; సామెత-ఉత్పత్తి, వికాసాలు; సామెత-వర్గీకరణాదుల గురించి చర్చించడం ఈ వ్యాసోద్దేశం కాదు. తెలుగు, మలయాళ భాషల్లో ఆలుమగల ప్రాధాన్యం గురించి చెప్పబడిన సామెతల్ని తులనాత్మకంగా అనుశీలించడం, అదీ రేఖామాత్రంగా పరిశీలించడమే ప్రస్తుత వ్యాస పరిమితి.

మలయాళ భాషలో సామెతను 'పళంచొల్' అంటారు. దీనికి అర్థం 'పాత మాట' అని. అరుదుగా 'పళమొళి' అనీ వ్యవహరిస్తారు. (తమిళంలో సామెతని 'పళమొళిగా' పేర్కొంటారు.)

**భార్య-ప్రాధాన్యం**

ఓం ప్రథమంగా ఆలి ప్రాధాన్య సంబంధిత సామెతల్లో ఓ తెలుగు సామెత-'ఇల్లాలు లేని ఇల్లు భూతాలకు నిలయం'.

భార్య లేని ఇల్లు పాడుపడి, బోసిపోయి కళావిహీనంగా ఉంటుందని చెప్పకుండా జానపదులు ఆ ఇల్లు భూతాలకు నిలయమై పోతుందని నిష్కర్షగా చెప్పారు. భూత ప్రేతాదుల ప్రళయంతో నిలయమైన ఇంటిలో గృహ వాతావరణం లయమవుతుంది. ఇంటిల్లి పాదికీ భయమవుతుంది. దీనికి సమానార్థకంగా మలయాళంలో 'భార్య ఇల్లాత్తవనె పిశాచుం అడుక్కుం' అన్నారు. దీనికి అర్థం 'భార్య లేని వాణ్ని పిశాచీ సమీపిస్తుంది' అని. కళత్రహీనుని నికట స్థలానికి పిశాచాలు వెళతాయని ప్రకటించారు మలయాళీలు. తెలుగు సామెత భార్యా రహిత గృహం భూత ప్రేతమయం అని చెబితే, మలయాళంలో 'పెళ్ళాం లేని వాణ్ణి పిశాచీ సమీపిస్తుంది' అని ఉంది. రెండింటి భావమూ ఒక్కటే! భార్య ఉంటే అనురాగ గీతాలు పాడుకోవచ్చు. ఆమె లేకుంటే భూత ప్రేతాలు ఆడుకుంటాయి. అందుకనే తెలుగులో 'ఇల్లాలు లేంది ఇల్లు కాదు' అని ఖచ్చితంగా చెప్పేశారు మరో సామెత ద్వారా.



'నీరు ఉంటే పల్లె, నారి ఉంటే ఇల్లు' అని మరో ఆంధ్ర సామెత. ప్రాచీన కాలం నుంచీ మానవ జాతి తన మనుగడనీ, అస్తిత్వాన్నీ, నదీతీరాల వెంటే కొనసాగిస్తోంది. ప్రాయికంగా జలస్థలాల్లోనే జనపదాలు పరిఢవిల్లాయి. ప్రతి ప్రాణికి నీళ్ళు ప్రధానావసరం. అందుకని నీళ్ళు ఉంటే పల్లె అవుతుందన్నారు. ఈ విషయాన్ని సామెతలోని మరో అంశం (దళం-కాజురా)తో 'నారి ఉంటే ఇల్లు'తో పోల్చారు. స్త్రీ ఉంటేనే ఇల్లు. కాదు అసలు స్త్రీ అంటేనే ఇల్లు. ఆమె లేని ఇల్లు ఆత్మ లేని ఒళ్ళు. గ్రామానికి నీళ్ళూ, గృహానికి నారీ ప్రధానావసరాలని సామెత భావం. మలయాళంలో దీనికి సమానంగా 'ఆలత్తురలుం వీట్టి ఉలక్కయుం చీనత్తమ్మియుం వీట్టిల్ ఒరుత్తియుం' అనే సామెత ఉంది. అంటే-'రావి రోలూ, విరుగుడు చేవ రోకలీ, చీనాదేశపు పాత్రమూ, ఇంటికి ఒక్కతీ' అని అర్థం. ఈ సామెతలో ప్రతి ఇంటికి అత్యంతావశ్యకాలైన నాలుగు అంశాల్ని ప్రస్తావించారు. అందులో 1. రావి కర్రతో తయారైన రోలు. 2. విరుగుడు చేవ కర్రతో చేసిన రోకలి 3. చీనా నుంచి వచ్చిన పాత్రం 4. ఇంటికి ఒక స్త్రీ. రావి చెట్టు కర్రతో చేసిన రోలు చాలా కాలం మనగలుగుతుంది. విశేషించి ఆరోగ్యానికి మంచిదనే నమ్మకం కూడా ఉంది. (నూరినప్పుడు రావి కర్ర కొంత అరుగుతుంది-అది ఒంటికి మేలు చేస్తుందని విశ్వాసం). విరుగుడు చేవ రోకలి దృఢంగా ఉంటుంది. ఈ విరుగుడు చేవనే తెలంగాణాలో 'జిట్ట రేగి' రోజ్‌ఉడ్) అంటారు. ఈ చెట్టు కర్రతో చేసిన పనిముట్టు గట్టిగానే కాకుండా అందంగానూ ఉంటుంది. ఇక ఇంటికి మూడో అవసరం పాత్రం.అయితే అది చైనా దేశం నుంచైనా ఫరవాలేదు. అక్కడి పాత్రం శ్రేష్ఠమైందట. సామెతలో ఆఖరిదైనా, నిఖార్సైన విషయం-'ఇంటికి ఒక్కతి' అనేది. ప్రతి ఇంటికీ ఓ స్త్రీ ఉండాలి అన్నారు. ఆమె లేని సదనంలో చక్కదనం లోపిస్తుంది. తెలుగులోని 'నీరు ఉంటే పల్లె, నారి ఉంటే ఇల్లు' అనే సామెతలో రెండు దళాలు ఉంటే; మలయాళంలో ఉపమానాల సంఖ్య (అంకె) మూడు కాబట్టి నాలుగు దళాల సామెత ఉంది. విషయం మాత్రం ఒక్కటే అన్నది విశదం.

తెలుగులోనే 'నారి లేని ఇల్లు, నారి లేని విల్లు' అని ఇంకో సామెతనీ చెప్పారు. నారి లేకపోతే వింటి టంకారాలు మృగ్యం. అలాగే నారి లేకుంటే ఇంటి శృంగారాలు శూన్యం. ఆలుమగల శృంగారం వినా అసలు సృష్టి సున్నా.

'ఆడది లేనిది అడవితో సమానం' అంటూ స్త్రీ ప్రాముఖ్యానికి చెందిన మరో

సామెతని చెప్పారు మనవాళ్ళు. మహిళ లేని గృహం గహనాటవులతో సమమట! 'ఇది ఊరు కాదు అడవి' అనే మాటని మనం తరచూ వింటుంటాం. ఊరు అడవి అవుతే భరించలేం. మరి అల్లాంటప్పుడు ఇల్లే అడవిగా మారిపోతే...(ఇల్లు ఊరికి మాతృక అదే అడవిగా మారితే బాధలూ, భయాలూ ఇంటి నుంచే ప్రారంభమవుతాయి-ఇది ఉచితం కాదు-అభిలషణీయం అంతకన్నా కాదు).

మలయాళీలు 'వీట్టిన్నలంకారం పెండాట్టియుం, మక్కళుం-కఞ్ఞిక్కలంకారం తేంగయుం, మాంగయుం' అన్నారు. 'ఇంటికి అలంకారం పెళ్లామూ పిల్లలూ-గంజికి అలంకారం కొబ్బరీ, మామిడికాయా' అని అర్థం. ఇంటికి పెట్టని నగలు భార్యా పిల్లలు. గంజి తాగేటప్పుడు కొబ్బరి ముక్కనీ, మామిడి చెక్కనీ నంజుకుంటే మహారంజుగా ఉంటుంది. సామెతలోని ఈ విషయం కేరళీయుల ఆహారపుటలవాటును వ్యక్తం చేస్తోంది. కేరళ రాష్ట్రం నాళికేర దేశం. వారికి కొబ్బరి చెట్టు మనకి తాటి చెట్టులా కల్పవృక్షం. కొబ్బరి నూనెనే వంటనూనెగానూ ఉపయోగించడం, కొబ్బరిని ఆహారంలో విధిగా వినియోగించడం సాధారణమైన అలవాట్లు వాళ్లకి. తెలుగులో 'ఆడది లేనిది అడవితో సమానం' అంటే-'ఇంటికి అలంకారం పెళ్లాం పిల్లలూ' అన్నారు మలయాళంలో. విషయం ఒక్కటే! అభివ్యక్తిలో మాత్రం అంతరం ఉంది. అంతే!

'నారే నరునకు రత్నము'

'నవరత్నములున్నా నారీ రత్నముండవలె' అని గౌరవార్థంలోనే స్త్రీ గురించి మరో రెండు సామెతలు తెలుగులో ఉన్నాయి. అలాగే 'ఇల్లుకాలినా, ఇల్లాలు చచ్చినా గొల్లు మానదు', 'గాజుల చెయ్యి గలగల లాడితే, ఇల్లు కళకళ లాడుతుంది'. 'కంకణాల చెయ్యి ఆడితే-కడియాల చెయ్యి ఆడును' మొదలైన సామెతలు సైతం స్త్రీ ప్రాధాన్యాన్ని చెప్పేవే!

'భార్య మాట, బతుకు బాట' అని సంక్షిప్తంగానూ, సంతృప్తంగానూ మరో సామెత ఉంది తెలుగులో. ఆలి మాట జీవితానికే బాట వేస్తుందనీ; ఆమె మాటను, సలహాను వినాలనీ సామెతసారం. మలయాళంలో 'నారీ శాపం ఇఱక్కికూడా' అన్నారు దీనికి సమానార్థకంగా. అంటే అర్థం 'స్త్రీ శాపం దింపుకోలేం' అని. స్త్రీ శపిస్తే దానికి పరిహారం గానీ, పరిష్కారం గానీ దుష్కరమనీ కేరళీయుల మనోగతం. మనం ఆలిమాట జీవన పథం అంటే అన్యాపదేశంగా వాళ్లూ మనతో ఏకీభవించారు.



తెలుగులో మరొక సామెత : 'కట్టుకొన్న పెళ్ళామే చెయ్యవలె-కన్నతల్లే చెయ్యవలె'. మనిషికి ఈ వ్యవస్థలో కష్టసుఖాలు రెండూ అనివార్యాలు. సుఖసందర్భాల్లో బంధుమిత్రులందరూ వెన్నంటే ఉంటారు. అది వాళ్ళకు అవసరం. కానీ దుఃఖసమయాల్లో అంతా అయోమయం-భయం భయం. అప్పుడెవరూ ఖరారుగా రారు. అయితే... పెళ్ళాం ఆదుకోవాలి-లేకుంటే తల్లి చూసుకోవాలి. కట్టుకొన్న భార్య కేవలం అవసర నిమిత్తం వచ్చింది కాదు. ఆమెకు బాధ్యతలున్నాయి భర్త పట్ల. పుట్టింటినుంచి కూకటివేళ్ళతో వచ్చి మెట్టినింటికి ఫలపుష్పాదులు అందించే భూజం ఆమె. ఇంటికి తేజం. 'నాతి చరామి' అనే పెళ్ళినాటి ప్రమాణంతో సమానంగా (మగని ప్రమాణం) ఆమె సైతం భర్త కష్టసుఖాల్లో పాలుపంచుకొంటుంది. ముఖ్యంగా బాధల్లో వ్యాధుల్లో కూరుకుపోయిన మగనికి పరిపరివిధాల పరిచర్యలు చేస్తుంది. అందుకే సామెతలో 'కట్టుకొన్న పెళ్ళామే చెయ్యవలె-కన్నతల్లే చెయ్యవలె' అన్నారు. సామెతలోని తర్వాతి భాగం తల్లికి సంబంధించింది. కట్టుకొన్న భార్య ఏ కారణాంతరాల చేతో మగని ముట్టుకోకపోతే కన్న కడుపు ఊరుకోదు. కొడుకు కష్టం చూసిన తల్లి మనసు కరిగిపోతుంది. వెంటనే సేవలు చేసి తన పుత్రుని కాపాడుకొంటుంది.

మలయాళంలో పై సామెతకి సమానార్థకంగా మూడున్నాయి.

1. కూడె కిడక్కున్నవళుక్కే రాప్పని అఱియావూ
   (వెంట ఉన్నదానికే రాత్రి వచ్చిన జ్వరం తెలుస్తుంది)
2. తనియ్క్కొరుత్తి ఇరున్నాల్ తలయ్క్కలిరున్ను కరయుం
   (తనకు ఒకతి ఉంటే తలవైపుకి ఉండి ఏడుస్తుంది)
3. కొండ పెండాట్టి తండె గుణమఱియుం
   (కట్టుకొన్న పెళ్ళాం తన గుణం తెలుసుకొంటుంది)

తెలుగు సామెత 'కట్టుకొన్న పెళ్ళామే చెయ్యవలె-కన్నతల్లే చెయ్యవలె' అని తల్లీ పెళ్ళాలపరంగా ఉంటే, మలయాళంలో తల్లి ప్రశంసే లేదు. మలయాళంలో మొదటి సామెత మగని వెంట ఉన్న మగువకు మాత్రమే రాత్రికి రాత్రి వచ్చిన భర్త జ్వరం తెలుస్తుంది అని చెబుతోంది. కాబట్టి ఆమె భర్తని కనిపెట్టి ఉంటుంది. రెండో సామెతలో-'తనకంటూ ఒకతి ఉంటే తనవైపున ఉండి ఏడుస్తుంది' అనడం కూడా సతికి పతిపట్ల ఉన్న సేవానిరతినీ, సహానుభూతినీ వ్యక్తం చెయ్యడమే. 'కట్టుకొన్న

పెళ్ళాం తన గుణం తెలుసుకొంటుంది' అనేది మూడోది. మగని గుణం మంచో, చెడో కట్టుకున్నది పట్టుకోగలుగుతుంది. ఈ మూడు మలయాళ సామెతల్లోని భావం తెలుగు సామెతకు దాదాపు దరిదాపు.

'ఆలిశుచి ఇల్లు చెబుతుంది'

'ఇంటికళ ఇల్లాలే చెబుతుంది'

'ఇంటి లక్ష్మిని వాకిలి చెబుతుంది'

'ఇల్లాలి శుచి ఇల్లుచూడగానే తెలుస్తుంది'.

'ఇల్లు చూసి ఇల్లాలును చూడమన్నారు'.

ఇవి తెలుగు సామెతలు 'గృహిణీ గృహముచ్యతే' - అని సంస్కృత సూక్తి-పై తెలుగు సామెతలు ఇంటికీ, ఇల్లాలికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని ఎత్తి చూపుతున్నాయి. ఇల్లాలు ఇంటికి లక్ష్మి-దీపం.

మలయాళంలో పై భావమే ఇల్లాలి పరంగా కాక పిల్లలపరంగా చెప్పడం జరిగింది. 'ఇల్లత్తె పుష్టి ఉణ్ణియుడె ఊరకొండు అఱియాం'. అంటే-ఇంటిలోని పుష్టి పిల్లవాని పిఱ్ఱలు చూసి తెలుసుకోవచ్చు అని. పిల్లల పిరుదుల ప్రమాణాన్ని బట్టి ఇంటి పుష్టిని తెలుసుకోగలమట.

'అగత్తె అళగు ముఖత్తు విళంగుం'.

'లోపల అందం ముఖమ్మీద ప్రకాశిస్తుంది'. అని మలయాళంలో సాధారణీకరం చేసిన సామెత.

'ఆలిని విడిస్తే హరిదాసు'-సంసారం విడిస్తే సన్యాసం' అనేది మరో సామెత తెలుగులో. భార్యని పరిత్యజించిన వాడు హరిదాసు అవుతాడు. కాపురం ఉండదు. ఏ పురంలోనే, గుడి గోపురం కిందో, ఆరుబయటో హరికథా పారాయణం చేసుకోవాలి. సంసారం విడిచిపెడితే సన్యాసమే మరి! మలయాళంలో 'పేయుం అఱియుం భార్యయేయుం కుట్టిగళేయుం' అన్నారు. 'పిశాచమూ తెలుసుకొంటుంది పెళ్ళాన్నీ, పిల్లల్నీ' అని అర్థం. అనుకంప అణువంత కూడా ఉండదనుకునే పిశాచిసైతం తన భార్యనీ, సంతానాన్నీ పట్టించుకొంటుంది. మరి మనిషికి మాత్రం ఆ మాత్రం పట్టింపూ, అవగాహనా ఉండక్కర్లేదా? అని పరోక్ష ప్రశ్న. 'తెలుగులోనేమో 'ఆలిని విడిస్తే హరిదాసు-సంసారం విడిస్తే సన్యాసి' అని వాచ్యంగా సామెత.



ఒక్కముక్కలో 'ఆడదే అమృతం-ఆడదే హాలాహలం' అని తెలుగులో స్త్రీని గురించి పరస్పర విరుద్ధ భావ ప్రకటనం చేశారు. బొమ్మకి ఇటువైపే కాదు అటువైపు సైతం చూశారు.

మలయాళంలో 'ఇరుములయ్క్కిడయిల్ ఇరులోకం' అన్నారు. దీనికి 'రెండు రొమ్ముల మధ్య రెండు లోకాలు' అని అర్థం. స్తనద్వయం మధ్య స్వర్గనరకాలు (లోకాలు రెండు రకాలు మాత్రమే ఇక్కడ) అంటూ వ్యంగ్యంగా భంగ్యంతరంగా చెప్పారు. 'ఆడదే అమృతం-ఆడదే హాలాహలం' అన్న తెలుగు సామెతకు మలయాళంలో సమానార్థకం రమణీయంగా ఉంది. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం' కదా! రెండు పాలిండ్ల మధ్య లోకద్వయం కనిపిస్తుందని ధ్వని. ఇలా ఆంధ్ర మలయాళాల్లో అనితర సాధ్యంగా వనితల (భార్యల) గౌరవాదరాలకు సంబంధించిన సామెతలు అనేకం ఉన్నాయి.

భర్త-ప్రాముఖ్యం

పితృస్వామిక వ్యవస్థలోని భావజాలం అంతా పురుషుని ప్రాధాన్యానికి, ఆధిక్యానికి అలంబనం. సమాజంలోని పురుష ప్రాధాన్యమే కుటుంబంలోని భర్త ప్రాముఖ్యానికి ప్రధాన కారణం-అసలు మూలం.

'పతియే ప్రత్యక్షదైవం' ఇది తెలుగు సామెత. చేసుకొన్న భర్తే భార్య సమక్షంలో ఉన్న భగవంతుడు అన్నారు. భార్యని చెప్పుచేతల్లో, అదుపాజ్ఞల్లో ఉంచుకోవాలన్న ఆరాటం పితృస్వామిక వ్యవస్థ సాధారణ లక్షణం. ఆ క్రమంలో పుట్టిన సామెతే ఇది. అయితే కేరళీయులూ దీనికి ఏ మాత్రం తీసిపోరు. 'పతితన్నె గతి' అన్నారు వాళ్ళు. 'పతియే గతి' అని అర్థం. ఆంధ్రులు 'పతియే ప్రత్యక్షదైవం' అంటే మలయాళీలు 'పతియే గతి' అన్నారు. మన వాళ్ళు ఒక మెట్టు ముందుకు వెళ్ళిపోయారు, ప్రత్యక్ష దైవ పద ప్రయోగంతో. గతి అంటే గమనం, మోక్షం, దిక్కు, సహాయాది అర్థాలు చెప్పుకోవచ్చు.

'మగవాడు లేనిది మఠం-ఆడది లేనిది అడవి' అనేది మరో తెలుగు సామెత. ఇది స్త్రీ పురుషులిద్దరి ప్రాశస్త్యాన్ని ప్రస్తావిస్తోంది. ఇంటికి ఉభయులూ అవసరమే. పురుషుడు లేని ఇల్లు మఠంగా మారిపోతుంది. మలయాళంలో 'వీడాయాల్ ఒరునాథన్ వేణం-కాదాయాల్ ఒరు కడువా వేణం' అన్నారు. 'ఇల్లు అయితే ఓ నాథుడు

కావాలి-అడవి అయితే ఓ పులి కావాలి' అని అర్థం. అడవికి పెద్ద పులి ఎంత గాంభీర్యాన్నీ, నిండుదనాన్నీ, పరిపాలననీ అందిస్తుందో, ఇంటికి హుందాతనాన్నీ అందచందాలనీ, పోషణనీ పతిమాత్రమే అందివ్వగలుగుతాడు. 'మగవాడు లేనిది మఠం' అన్నది భావమైతే 'ఇల్లు అయితే నాథుడు కావాలి' (ఇల్లు ఉంటే నాథుడు ఉండాలి అని) అన్నారు కేరళ ప్రజలు.

'దరి లేని బావి-దాపు లేని కొంప'తో సమం అని తెలుగులో సామెత. పురుషుడు కాపురుషుడైనా, ఏ పురుషుడైనా... పెళ్ళాడిన భర్త అయితే ఆయనతో కాపురం చేయడం సతికి తప్పదు అన్నారు.

'కల్లు ఎన్నాలుం కణవన్-పుల్లు ఎన్నాలుం పురుషన్'

(రాయి అయినా భర్త-గడ్డి అయినా పురుషుడు)

'కళ్ళన్ ఎంగిలుం, వెళ్ళన్ ఎంగిలుం ఒరు ఆణ్ పిఅఞ్ఞవన్ అల్లే"

(దొంగ అయినా, దొర అయినా ఓ మగోడు కదా!)

-ఇవి మలయాళ సామెతలు. పతిది పాషాణ హృదయం అయినా దయ ఉదయం కాకపోదని ధ్వని. గడ్డితో సమానమైనా మగడు/మగవాడు కదా అన్నారు రెండో అర్థభాగంలో. దొంగయినా, దొర అయినా మగోడు కదా! అని మరో సామెత. మగ పుటక అయితే దొంగైనా, దొరైనా ఫరవాలేదుట. ఈ సామెతలు ఖచ్చితంగా పురుషుల లోపాలకు సున్నం పూతలు. తప్పు ఎవరిదైనా తప్పే. అయితే ఆనాటి పల్లీయుల దృష్టి వేరు.

'తల్లిదండ్రులు అన్నదమ్ములున్నా, పొలతికి పురుషుడు కొరవే'

'మగడు లేని మనువున్నదా?'

'కాలంతో కరువు లేదు-మగనితో దరిద్రం లేదు' మొదలైన సామెతలు భర్త ప్రాముఖ్యాన్ని ప్రదర్శిస్తున్నాయి.

తెలుగులో భర్త ప్రాధాన్యాన్ని ప్రకటించే రెండు సామెతలు ఇలా ఉన్నాయి.

1. భర్తలోకం తన లోకం-కొడుకు లోకం పరలోకం.

2. ఊళ్ళేలే కొడుకు కన్నా ఉపాదానమెత్తే పెనిమిటి నయం.

కొడుకు ఎంత గొప్పవాడైనా తల్లి పట్ల చిన్నప్పటి ప్రేమని మరిచిపోతాడని గ్రామీణులు గమనించారు. కన్న కొడుకు కన్న భర్తే మిన్న. అందుకని తాను కని పెంచిన కొడుకు లోకం పరలోకం అన్నారు. కాని మగని లోకం తన లోకం. అక్కడ భార్యకు హక్కు ఉంది. భర్త అనే పెద్ద దిక్కు ఉంది. కలో, గంజో...కలిసి తినే ఆప్యాయత ఉంది. ఒకరి కోసం మరొకరు అనే సమష్టి భావం, స్వీయ ప్రత్యయత్యాగం ఉన్నాయి. 'ఢిల్లీకి' రాజయినా తల్లికి కొడుకే' అని ఎంత చెప్పుకున్నా ఆచరణలో ప్రాయికంగా కొడుకు తల్లిని విస్మరిస్తాడు. కాబట్టి తిరిపెం ఎత్తుకుని తెచ్చే కూడైనా భార్యకి మురిపెమే. అది ఉపాదానమే కావచ్చు-భార్యకి ఉపాధేయం.

పై తెలుగు సామెతకు సమానార్థకంగా 'మక్కళ్కఞ్ఞిదుఃఖ కఞ్ఞి; మాప్పిళకఞ్ఞి మధురకఞ్ఞి' అని మలయాళంలో ఉంది. అంటే 'పిల్లల గంజి దుఃఖపు గంజి. భర్త గంజి మధురమైన గంజి' అని అర్థం. తన పిల్లలు పోసే గంజి తనకు దుఃఖాన్ని కలిగించేది. కాని మగడు పోసే గంజి మాత్రం మాధుర్యాన్ని ఇచ్చేది. ఈ సామెత భావం తెలుగు దగ్గరే.

'పడుగూ పేకా కలిస్తే గుడ్డ-ఆలూ మగలూ కలిస్తే ఇల్లు' అనే తెలుగు సామెత ఆలుమగలిద్దరి పరంగా చెప్పడం జరిగింది. బట్టకు పడుగుపేకలు రెండూ అవసరమే. అందులో ఏ ఒక్కటి లోపించినా గుడ్డకి అస్తిత్వం లేదు. వస్త్రానికి వ్యకిత్వం రాదు. అలాగే ఇంటికి భార్యాభర్తలిద్దరూ అత్యంతావశ్యకం. అప్పుడే అది పాలూ పంచదారలా కలిసిన దాంపత్య మనడం శక్యం.

మరి మలయాళంలో 'అణుం పెణ్ణుం నెయ్యుం తీయుం' అన్నారు. 'పురుషుడూ, స్త్రీల నెయ్యి, నిప్పు' (అగ్నీ ఆజ్యాలూ) అని అర్థం. మగడు నెయ్యి, స్త్రీ ఆజ్యం. రెండింటిలో ఏది లోపించినా ఫలితం పూజ్యం. 'ఆలుమగలు కలిస్తే ఇల్లు' అవుతుందని మనం చెబితే 'ఆడా మగా అగ్నీ ఆజ్యాలు' అని వాళ్ళు అన్నారు. ఉభయ భాషల్లోనూ చెప్పిన అంశం ఒకే తీరు. అయితే చెప్పిన రీతి వేరు.

'సతి పతులు చక్కగా ఉంటే సంతలో పిల్ల చింత లేదు' అని మరో సామెత. భార్యాభర్తలు ఒద్దికగా ఉంటే అంగట్లోనైనా చీకూ చింతా లేక దాంపత్యం చెయ్యవచ్చు. కాపురుషులైతే కాపురం కష్టం. కుదురుగా ఉంటే ఎలాంటి కష్టాలనైనా ఎదుర్కోగలం. 'వెట్టిలక్కు ఒతుంగాత్త పాక్కుం ఇల్ల-ఆణిను ఒతుంగాత్త పెణ్ణుం ఇల్ల' (తమలపాకుకి ఒదగని వక్క లేదు-మగవాడికి ఒదగని స్త్రీ లేదు) అని మలయాళంలో చెప్పారు. 'సతిపతులు చక్కగా ఉంటే సంతలో పిల్ల చింత లేదు' అనేది మన ఆవిష్కృతి

అయితే-మలయాళీలు పురుషుడికి ఒదగని పొలతి లేదు అన్నారు నిర్ద్వంద్వంగా. విధిగా భర్తకు ఒద్దికగా ఉండే భార్య ఉంటుందన్నారు కేరళీయులు. మళ్ళీ వాళ్ళే -'ఉడల్ రండు ఉయిర్ ఒన్ను' అన్నారు. 'దేహాలు రెండు. ప్రాణం (ఉసురు) ఒక్కటి' అని అర్థం. ఇలా పందిరి తీగలై అల్లుకుపోయిన ఆలుమగలిద్దరి సామెతలు ఆదర్శ దాంపత్యానికి ఎత్తిన ఆదర్శాలు.

తెలుగు మలయాళ సామెతలు ఒకే రకంగా భార్య ప్రాముఖ్యాన్ని, భర్త గొప్పతనాన్ని, ఉభయుల ప్రాధాన్యాన్ని ప్రస్తావించాయి. మాతృపితృస్వామిక వ్యవస్థలకు భార్యాభర్తల సామెతలు వరసగా ప్రాతినిధ్యం వహించాయి. ఉభయ భాషా సామెతల్లో అనేక సామ్యతలు కనిపిస్తాయి. ఈ సాదృశ్యాల ఏకీభావానికి కారణం మనిషి ఎక్కడి వాడైనా అతిని కష్ట సుఖాలు, ఆశ నిరాశలు, బతుకులోని ఆటుపోట్లు, చీకటి వెలుగులు, హాస శోకాలు దాదాపు ఒక్కతీరుగా ఉండటమే. ఆలుమగల సామెతల్లో ఇంకా కుల/పరకాంతలు, భార్య-చిన్న చూపు, భార్య-అదృష్ట, దురదృష్టాలు, భార్య-వ్యామోహం, భార్య-పాతివ్రత్యం, భార్య-రంకుతనం, భార్య-గడుసుదనం, భార్య-అందచందాలు, మరికొందరు భార్యలు, నపుంసక మగలు, దరిద్రపు మగలు, తిండిపోతు మగలు, తెలివి తక్కువ మగలు, భార్యాభర్తలు-కలహం, ఒకరికొకరు తగిన/మించిన ఆలుమగలు మొదలైన అనేక శీర్షికల క్రింద వింగడించి వివరించవచ్చు. వ్యాస పరిమితుల్ని దృష్టిలో ఉంచుకొని కేవలం ఆలుమగల ప్రాధాన్యాన్ని వివరించే సామెతల గురించే ప్రస్తుతం ప్రస్తావించడం జరిగింది.

*- తెలుగు జూలై, 1993*



# ఈ దేశంలో ముస్లిమ్‌ల దుస్థితి

(కన్నడ రచయిత 'బోళువారు మహమ్మద్ కుంజి' కథల సంకలనం 'దేవర గళ రాజ్యదల్లి' (దేవుళ్ల రాజ్యంలో) ముందుమాట ఇది. మహమ్మద్ కుంజి మొదటి పుస్తకం 'అత్త యిత్తగళ సుత్తుముత్తు' (అక్కడా ఇక్కడా అంతటా) ఎన్నో సంచలనాలకు అతను పెట్టింది పేరు).

ఈ దేశంలోని ముస్లిమ్‌లు కడుపేదవాళ్లు. అంతేకాదు వాళ్ళు అత్యంత అవమానితులు. హరిజనుల్లాగే ముస్లిమ్‌లు కూడా మనదేశంలో రెండోశ్రేణి గౌరవానికి మాత్రమే నోచుకున్న ప్రజాసమూహం. హరిజనులకన్నా మిక్కిలి నిరుపేదలు, నిరక్షరాస్యులు. పెద్ద సంఖ్యలో సామాజికంగా వెనకబడిన వాళ్ళు వున్నది కూడా ముస్లిము ల్లోనే! దేశ జనాభాలో సుమారు పన్నెండు శాతం వున్న ముస్లిమ్‌లకు విద్యా ఉద్యోగ అవకాశాల్లో న్యాయంగా దక్కాల్సిన ఆ పన్నెండు శాతం కూడా దక్కడం లేదు. ఈ అన్యాయం చాలదన్నట్లు మనదేశంలో ఒకచోట కాకపోతే మరోచోట అత్యంత క్షుద్ర కారణాల కొరకు ముస్లిమ్‌ల మీద పూర్వనిర్ధారితమైన పకడ్బందీ దాడులు జరుగుతూనే ఉన్నాయి. సువ్యవస్థితంగా నడుస్తోన్న ఈ దాడుల్లో ముస్లిమ్ సోదరుల ఇళ్లూ, ఆస్తి పాస్తులూ, దుకాణాలూ వినాశనానికి గురవుతున్నాయి. పైగా పెద్ద సంఖ్యలో ముస్లిమ్‌లను వాళ్ళు ముస్లిమ్‌లనే ఒకే ఒక్క కారణంతో హతమారుస్తున్నారు. ఈ దాడులన్నింటిలోనూ పెద్ద మొత్తంలో ప్రాణ నష్టం, ఆస్తి నష్టాలకు గురవుతున్నవాళ్ళు ముస్లిమ్‌లు. కానీ ఈ దాడుల్లో అరెస్ట్ అవుతున్నవాళ్ళలో కూడా ముస్లిమ్‌లదే పెద్ద

సంఖ్య. అనేక సందర్భాలలో బహుళ సంఖ్యాక వర్గాల నేరస్థులకు ఏ శిక్షా పడడం లేదు. అంత మాత్రమే కాదు. వాళ్ళు కొంతమంది దృష్టిలో అఖండ దేశభక్తులుగా మారిపోతున్నారు. సాధారణంగా ప్రభుత్వ క్రిందిస్థాయి అధికారులు, ఉద్యోగులు, న్యాయ వ్యవస్థ, పోలీసులు... దాడులకు లోనైన ముస్లిమ్‌లకు ఏ రకమైన రక్షణనూ కల్పించలేకపోతున్నారు. ఈ అధికార యంత్రాంగంలో చాలామంది బహుళ సంఖ్యాకవర్గాల వాళ్లవడం చేత వీళ్ళు ఈ దాడుల్లో పాల్గొనే గూండాల అత్యాచారాలకు సహాయ సహకారాలు అందిస్తున్నారు. లేదా చూసీచూడనట్లు మిన్నకుండిపోతున్నారు.

అత్యధిక సర్క్యులేషన్ కల్గిన మన 'జనప్రియ' లాంటి పత్రికలన్నీ హిందూ ముస్లింల మత కలహాల గురించి తప్పుడు వార్తలు రాస్తున్నాయి. లేదూ ఏ విషయాన్నీ చెప్పకుండా మొహం చాటేస్తున్నాయి. ముస్లిమ్‌ల సామాజిక వెనకబాటుతనం గురించి కూడా ఆ పత్రికలు విపరీత నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. అందువల్ల కేవలం ఈ మోస్తరు పత్రికల నిత్య పారాయణంతో తమ మనస్సాక్షి నిత్యం ప్రతిష్ట చేసుకుంటోన్న మనదేశంలోని విద్యావంతులైన ఉదారవాదులు; ఈ దేశంలో ముస్లిమ్‌లపై నడుస్తోన్న దాడులు, దొమ్మీలు, అత్యాచారాలు, దోపిడీల గురించి కళ్లుండీ చూడలేని కబోదులవుతున్నారు. ముస్లిమ్‌ల మీద జరిగే దాడులన్నింటినీ మన పత్రికలు 'రెండు మతాలు లేదా వర్గాల మధ్య జరిగే సంఘర్షణ' అని వర్ణిస్తున్నాయి. ముస్లిమ్ అల్ప సంఖ్యాకుల మీద జరిగే అధిక సంఖ్యాక మతస్థుల దాడి, రెండు సమవుజ్జీ బలాలు కల్గిన గుంపుల మధ్య జరిగే సంఘర్షణ అన్నట్లుగానే చిత్రీకరిస్తున్నాయి. మన ఉదారవాదుల అంతరాత్మలు ప్రశాంతంగా నిద్ర పోవడానికి ఇది చాలు.

కానీ ఈ దాడుల వెనక వున్న అధిక సంఖ్యాకుల నరమేధ ఫాసిస్టు రాజకీయాలకిది చాలదు. ఈ రాజకీయ ప్రచార యంత్రాంగం, మతకలహాల పేరుతో ముస్లిమ్‌ల మీద జరిగే దాడులకు మతపరమైన చారిత్రకమైన సాక్షాల్ని చూపుతోంది. ఈ ప్రచార యంత్రాంగానికి మధ్యయుగాల నాటి ముస్లిమ్ రాజుల పరిపాలన, ఇదే ముస్లిమ్ ప్రజా సమూహాల సార్వకాలిక కార్యానికి సాక్ష్యంగా మారుతోంది. అవిద్య, సామాజిక వెనకబాటు తనాలతో ముస్లిముల్లో వేళ్లూనుకొని ఉన్న రిజిడిటి, మూఢాచారాలను కుట్రలుగా ఈ రాజకీయ ప్రచార సాధనాలే ఎత్తిచూపుతున్నాయి. అధికారం, హోదాల కోసం జరిగిన యుద్ధాలు, రక్తపాతాలు, ఆనాటి వలసవాద రాజకీయ లక్షణాలైనప్పటికీ..



మన చరిత్రలోని ముస్లిమ్ రాజుల దండయాత్రల పర్యవసానంగా వాళ్ళు ధ్వంసం చేసిన గుళ్లూ, గోపురాల బాధ్యతని ఈ దేశ ముస్లిమ్‌ల తలల మీద అన్ని కాలాల్లోనూ మోపుతున్నాయి. అలాగే సామ్రాజ్య వాద దోపిడీ రాజకీయాల అనివార్య పర్యవసానమైన దేశ విభజన తాలూకు యావత్తు జవాబుదారీని ముస్లిమ్‌ల పైన మాత్రమే మోపడం జరుగుతోంది. ఈ కారణంతో మత కలహాల్లో పేద ముస్లిమ్‌లు తమ పట్టెడన్నానికి ఆసరా అయిన ఈ మట్టిని పోగొట్టుకోవడం, అమాయకులు బలి కావడం., మన విద్యావంతులకు కూడా సీరియస్ సమస్యగా కన్పించడం లేదు. అది ముస్లిమ్‌లు చేసిన 'అపరాధా'నికి వాళ్ళనుభవించాల్సిన శిక్ష అని ఆలోచించడం వాళ్ళకి అలవాటయిపోయింది. ఈ దేశంలో భార్యాపిల్లలు, తల్లిదండ్రులు, అన్నాదమ్ములు, అక్కాచెల్లెళ్ళతో రక్తసంబంధాలు కలిగి ఏదో ఒక ఉద్యోగం చేసి పొట్టపోసుకుంటున్న కడుపేదలు....మనలాగే మీలాగే రక్తమాంసాలు, చీమూనెత్తురు కల్గిన మనుష్యులు...వాళ్ళు ముస్లిమ్‌లవుతే, మన మట్టుకు మాత్రం వాళ్ళు ప్రాణంతో తిరుగాడుతోన్న వ్యక్తులు కాదు, వాళ్ళు సామూహిక పాపానికీ, అపరాధానికీ సంకేతాలు. చారిత్రక తప్పిదంగా అర్థం చేసుకోబడుతోన్న చారిత్రక ప్రతీకలు.

ఈ కారణంచేతే మన దేశంలో మత కలహాల పేరుతో ముస్లిమ్‌ల మీద జరిగే దాడుల్లో మన నగరాల్లోని అధిక సంఖ్యాకవర్గాల్లో సగంసగం చదువుకున్నవాళ్ళు మాత్రమే క్రియాశీలక పాత్ర పోషిస్తున్నారు. ముస్లిముల గురించి తిరస్కార భావం, ద్వేషం, అనుమానాలు, దురభిప్రాయాలు వెరసి మన నగరాల్లోని హాఫ్ నాలెడ్జ్ మనుషుల మెదళ్ళలో తిష్ట వేసుకొన్నాయి. మన పల్లెల్లోనూ పెద్ద మొత్తంలో ముస్లిమ్‌లున్నా ఈ ద్వేషపిశాచం పల్లెలకు ఇంకా సోకలేదు. పైగా ఈ దేశంలో ముస్లిమ్‌లకు 800 సంవత్సరాల చరిత్ర వున్నా హిందూ ముస్లిమ్‌ల మధ్య ఈ మతకలహాలు ఈ శతాబ్దిలో మాత్రమే కన్పించాయి. 19వ శతాబ్ది అంతం వరకూ ఇవి లేనేలేవని సాక్ష్యాధారాలతో సహా ప్రఖ్యాత చారిత్రకవేత్త రోమిల్లా థాపర్ ఎత్తి చూపించారు. ఎన్నడో ఎవరివల్లో జరిగిన అపరాధాలకు ఖివాళ్టి ముస్లిమ్‌లందర్నీ బాధ్యుల్ని చేసే ఈ ప్రవృత్తికి గొర్రె దాటుడు జనాల ద్వేషం ఒక్కటే కారణం. మరొక చారిత్రక నేపథ్యం ఏదీ దీనిక్కారణం కాదు.

ఏ దేశంలోనైనా రెండోశ్రేణి ప్రజలు మాత్రమే ఇలాంటి ఎన్నడో జరిగిన తప్పులకి

సంకేతాలుగా మారిపోతున్నారు. (హరిజనులు అశుచి, మైలలకు సంకేతాలవుతున్నట్లు) మొత్తం ఆ జాతిజనాలు అపరాధుల్లా కనిపిస్తారు. యూరప్‌లోనూ క్రిస్టియన్‌లకు యూదులు అసలు మనుష్యుల్లాగే కన్పించరు. వాళ్ళు పాపం తాలూకు అపరాధం బాపతు సంకేతాల్లాగ మారిపోయారు. క్రీస్తును శిలువేసిన తప్పుకి నైతిక బాధ్యతను ఈ యూదుజాతి మీద ఎళ్ళవేళలా మోపి నలభై మిలియన్ల యూదుల్ని చిత్రహింసల పాలుచేసి వధించిన క్రిస్టియన్‌ల ఈ ప్రవృత్తి జర్మన్ నాజీ పరిపాలనలో పరాకాష్ఠకు చేరింది. భారతదేశంలో ముస్లిమ్‌ల మీద జరుగుతున్న దాడులకూ, నాజీ పైశాచికత్వానికీ పెద్దగా మూలంలో వ్యత్యాసాల్లేవు. ఉన్న వ్యత్యాసాలు ఏవైనప్పటికీ కేవలం వివరాలకు సంబంధించినవి. ముస్లిమ్‌లను సదా సంశయాలతోనూ ద్వేషభావంతోనూ చూసే ధోరణి కూడా నాజీ సిద్ధాంతానికి అసలు సిసలు నకలు.

ముస్లిమ్‌లు మనదేశంలోని రెండోశ్రేణి ప్రజలు కావడం చేతే వాళ్ళకు 'భారతీయులు కావడం కోసం', 'దేశం పట్ల భక్తి ప్రపత్తులు కలిగుండటం కొరకు', 'హిందూమతాన్ని గౌరవించడం కోసం', 'దేశ సంస్కృతికి సంబంధించిన ప్రధాన స్రవంతిలో చేరడం కొరకు' సదా పిలుపు నివ్వడం జరుగుతుంది. ఇవన్నీ వాళ్ళ మంచికోసమే' అనే ఔదార్యాన్ని చూపించడం మన స్వదేశీ బ్రాంచి ఫాసిస్టులు మరవడం లేదు. రెండోశ్రేణి ప్రజలకు తమ మంచి తాలూకు దారి ఏమాత్రం తెలియదన్న మాట. వాళ్ళకి ఏది మంచి దారో ఎంచుకునే హక్కు కూడా వుండకూడదన్నమాట. వాళ్ళు ఎల్లప్పుడూ వాళ్ళ మంచికోసమే సంస్కృతికి సంబంధించిన ప్రధాన స్రవంతిలో ఒక్కటయిపోవాలి. బహుళ సంఖ్యాక వర్గాల భాషే మాట్లాడాలి (పదికోట్ల మంది మాట్లాడే ఉర్దూకి దేశంలోని ఏ రాష్ట్రంలోనూ అధికార భాషాస్థాయి లేదన్నది గమనార్హ విషయం). ఇల్లూ, వాకిలీ, భార్యాపిల్లలూ, తిండీ తిప్పలు తాపత్రయాలతో సతమతమవుతోన్న మనుషులతో...వాళ్ళ కష్టసుఖాల గురించి మనం నాలుగు మంచి మాటలు మాట్లాడితే బావుంటుంది. కానీ 'సంస్కృతి, మతం, భాష...ఇలాంటి ప్రధాన స్రవంతుల్లో కలిసిపోండి. అదీ మీ మంచికే' అంటూ వాళ్ళకి పిచ్చిపిచ్చిగా పిలుపులు ఇవ్వకూడదు. ఆ మనుష్యులు రెండోశ్రేణి ప్రజలుగా చూడబడుతున్నప్పుడు, వాళ్ళని ఒక అపరాధాల సంకేతాలుగా పరిగణిస్తున్నప్పుడు మాత్రమే మనమిలాంటి తప్పిదాలకు బాధ్యుణ్ణి చేయడమంటే అతని వ్యక్తిత్వాన్ని నిలువునా కాల్చడమన్నమాట. మతకలహాలతో జరిగే ప్రాణ నష్టాలన్నీ



తార్కికంగా ఈ బౌద్ధిక హత్యలకు పూర్వ రంగాలవుతున్నాయి. మన ఉదారవాదులు కూడా గమనించాల్సిన విషయాలివి.

ముస్లిమ్‌ల గురించి మన అధిక సంఖ్యాక వర్గాలకు వుండే సందేహాలు, ద్వేషాభిప్రాయాలన్నీ విచిత్ర రూపాన్ని సంతరించుకుంటాయి. ఉదాహరణకు పాక్‌లోనో, బంగ్లాదేశ్‌లోనో జరిగే ఘోరాలకు ఇక్కడి ముస్లిమ్‌లు ప్రశ్నార్హులు అవుతారు. పైగా జవాబ్దారీ అవుతారు. ఈ దేశంలో ముస్లిమ్‌ల హద్దుల్ని, ఆ దేశాలలోని పౌర హక్కుల దుస్థితితో ముడిపెడతారు. పాకిస్థాన్, బంగ్లాదేశ్‌లు మతపరమైన దేశాలు. మనదేశం అలాంటిది కాదని అలవోకగా మరచిపోతారు. ఈ దేశ ముస్లిమ్‌లను ఇలాగే వదిలితే ఇవాళ కాకుండా ఓ రోజు వాళ్ళు దేశ ద్రోహులవుతారనే సాకుతోనే ముస్లిమ్‌ల పట్ల ద్వేషాన్ని కక్కే సంస్థలు మనలో అత్యంత 'గౌరవాస్పద' సంస్థలుగా పరిఢవిల్లుతున్నాయి. చరిత్రలో మునుపు జరిగిన పొరపాట్లకు మాత్రమే కాదు, ప్రపంచంలో పాక్‌లాంటి దేశాల్లో నడిచే తప్పిదాలకూ, భవిష్యత్తులో ఇలా సంభవించవచ్చు అని మనం భయంతో ఊహించుకునే తప్పులకూ ముస్లిమ్‌లు మొత్తంగా బాధ్యులవుతోన్న విషాదకర సన్నివేశమిది. జ్ఞాపకాలు, భయాలు, సంశయాలు, ఊహలు, సమస్త భావాలూ ముస్లిమ్‌లనగానే ద్వేషం రంగునే పులుముకున్నాయి. ఎలాంటి తప్పిదాలకైనా స్థలకాల పరిమితులుంటాయి. కాని ఈ దేశంలో ముస్లిమ్‌లుగా పుట్టిన పాపానికి కాలం హద్దులూ లేవు, దేశం గీతలూ వుండవు.

నమ్మదగిన ఎలాంటి గణాంక వివరాలు లేనప్పటికీ, ముస్లిమ్‌లందరూ నాలుగైదు పెళ్ళిళ్ళు చేసుకుని కుటుంబ నియంత్రణకు విరుద్ధంగా పిల్లల్ని కని తమ జనాభాను విపరీతంగా పెంచుకొంటున్నారనే ప్రచారం కూడా జరుగుతోంది. కానీ చరిత్రలో ఏ ఒక్క ప్రజా సమూహపు జాతి, ఏ దేశంలో, ఏ కాలంలో, ఇలా ఉద్దేశ్యపూర్వకంగా తమ మతస్థుల జనాభాని పెంచుకున్న దాఖలాల్లేవు. భారత జనాభా గణన వార్తలు కూడా ఈ తప్పుడు ప్రచారాన్ని సమర్థించడం లేదు. ఏ సుదూర భవిష్యత్తులోనో తమ మతస్థులు అత్యధిక సంఖ్యాకులు కావాలన్న ఆశతో ప్రతి ఒక్క ముస్లిం పురుషుడూ ఆంబోతుల్లా పిల్లల్ని పుట్టిస్తున్నాడన్న ఆలోచనే హాస్యాస్పదమైంది. అలాగే ముస్లిమ్ ఆడవాళ్ళను బుర్ఖాలో దాచేస్తున్న వాళ్ళకు విద్య, ఇతర హక్కుల్ని నిరాకరిస్తోన్న మూఢాచారాలు, కుటుంబ నియంత్రణ గురించి వాళ్ళకుండే అనాసక్తి...ఇవన్నీ

ముస్లిమ్‌లు తమ మతస్థుల ప్రత్యేకత చాటుకోవడానికి సామూహికంగా కావాలని చేస్తోన్న కుట్ర అని వాదించబడుతోంది. కానీ ఇలాంటివి... సాంస్కృతిక, సాంఘిక, ఆర్థిక, విద్యా రంగాలన్నింటిలో వెనకబడినట్టి జాతి లక్షణాలు. హిందువుల్లోనూ నిరక్షరాస్యులైన పేద హిందువులే మూఢాచారాల వలల్లో చిక్కుకుపోయివున్నవాళ్ళు. వీళ్ళ కుటుంబాల్లోనూ ఆడవాళ్ళు వంటింటికి ఖైదీలై వున్నారు. వస్త్రధారణ విషయంలోనూ హిందువుల క్కూడా స్త్రీ శరీరమంతా కామం తాలూకు..తద్వారా సిగ్గుతో దాచుకోవాల్సిన వస్తువు. హిందువుల చీర రవికెల కన్న ముస్లిమ్‌ల బుర్ఖా దేహాన్ని కేవలం ఏడెనిమిది యించులు మాత్రమే ఎక్కువగా కప్పి పెడుతోందన్న విషయం మనం గమనించాలి. హిందువుల్లోనూ మగవాళ్ళు మాత్రమే కుటుంబ యజమానులుగా పరిగణింపబడ్డం, మగవాళ్ళు యింట్లో వున్నప్పుడు స్త్రీలు ఇంటి బయటికి రాకుండా వుండటం, ఆడవాళ్ళు ఒంటరిగా బయటికి వెళ్ళలేకపోవడం, మగవాళ్ళతో మాట్లాడుతున్నప్పుడు చీర చెంగుని ముఖానికి అడ్డంగా వుంచుకోవడం, పర పురుషుల్ని చూడకుండా వుండిపోవడం, ఇంట్లో మగవాళ్ళందరూ తిన్న తర్వాతే మిగిలింది తినడం, విద్యా, వైద్యం, వినోదాలు, ఆహారం మొదలైన వాటన్నింటిలోనూ భర్తలూ, మగ సంతానమూ ఎక్కువ భాగం పొందడం మొదలైనవన్నీ ఇప్పటికీ మనకు కనిపిస్తాయి.

(హిందూ సంస్కృతిలో స్త్రీలను ఎలా చూస్తున్నారో కావాలంటే పోలంకి రామమూర్తి 'భారతీయ సంస్కృతిలో స్త్రీ' (కన్నడ గ్రంథం)లో చూడండి.)

కుటుంబ నియంత్రణ పట్ల వెనకబడిన నిరక్షరాస్యుల నిరుపేద హిందువులు కూడా అలాంటి లక్షణాలే కల్గిన ముస్లిమ్‌ల్లాగే సంకోచపడుతున్నారు. మనదేశంలో కుటుంబ నియంత్రణకు సామాన్య కుటుంబాల్లో యిలాంటి వెనకబడ్డ కుటుంబాలదే పెద్ద సంఖ్య అని మనం విధిగా గమనించాలి.

మన పూర్వ నిర్ధారిత దృష్టికి ముస్లిముల్లో కన్పించే అనేక ఆచారాలు హిందువుల్లోనూ వున్నాయి అనే సత్యం అసలు పట్టదు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే తమ జీవన విధానంలోనూ, తమ దైనందిన కార్యకలాపాల్లోనూ హిందూ సంస్కారాలను వదిలివేసిన మధ్యతరగతి విద్యావంతులైన మన హిందువులు మన గతచరిత్ర గురించి ఆలోచిస్తున్నప్పుడు మాత్రం పక్కా హిందువులై పోతారు. అంతేకాదు తమ మతంలోనే అధిక సంఖ్యాకులు యింకా అందిపుచ్చుకోలేని స్త్రీ స్వాతంత్ర్యం, విద్య, శాస్త్రీయ



దృక్పథం, మతసామరస్యం...ఇలాంటి విలువలు ముస్లిమ్‌లు ఎకాయెకి కల్గి ఉండాలని కోరుకునేవారు సంస్కరణ వాదులు కూడా అవుతారు. ముస్లిమ్‌లకు విలువలు లేకపోతే అది వాళ్ళ వెనుకబాటుతనంతో కాదట, పైగా అది ఉద్దేశ్యపూర్వకమైన లోపల్లోపల వాళ్ళంతా కలిసికట్టుగా నిర్ణయించుకొన్న విద్రోహ చింతన అని ఈ జనం నిర్ధారిస్తున్నారు. మన ఈ ఒక సామూహిక కుట్రకి బలై, కడకు మానవీయ స్పర్శ, అణకువ, సోదర భావాలను కోల్పోతున్న ఒకానొక జాతి దురంతమిది. నేను అత్యుక్తులు చెప్పడం లేదు. ఊహాపోహలు రాయడం లేదు. ఆలంకారిక పరిభాష ఉపయోగించడం లేదు. నాజీ జర్మనీలో జరిగిన జాతి హత్య తాలూకు అంచనా వున్నవాళ్ళకి..మన దేశానికి స్వాతంత్ర్యం లభించిన సందర్భంలో తూర్పు పాకిస్థాన్, పంజాబులో జరిగిన మతపరమైన హింసా స్మృతులు యింకా చెరిగిపోని వాళ్ళకి ఇది తప్పక అర్థమవుతుంది. ఈ దేశంలో ముస్లిమ్‌లను పాపం, క్రూరత్వం, ద్రోహాల సంకేతాలుగా పరిగణించే ఆటవికతకు విరుద్ధంగా గొంతెత్తవలసిన సమయమిది. ముస్లిమ్‌లను పాక్ ఏజెంట్లు అనో, హిందూ మందిరాల్నీ, హిందూ స్త్రీలనీ అపవిత్రం చేయాలని కోరుకునే నీచులనో లేదూ మున్ముందు ఎప్పుడో ఓనాడు ఈ దేశాన్నంతా తమ మతస్థులతోనే నింపడానికి ఇప్పట్నించే నాలుగైదు పెళ్ళిళ్ళు చేసుకొని యుద్ధప్రాతిపదిక మీద పిల్లల్ని పుట్టించే పురుషపుంగవులనో ఆలోచించడం ముమ్మాటికీ తప్పు. పాపం, ద్రోహం తాలూకు ప్రతీకలుగా మిగిలిపోయిన ముస్లిమ్ సోదరులు సైతం మనకిమల్లే మన కళ్ళముందు మన మట్టి మీదే మసలుతున్న సజీవమూర్తులు. చారిత్రక తప్పిదాన్ని తరతరాలుగా మోస్తున్న ఈ ప్రజాసమూహం కూడా రోజువారీ బతుకు తిప్పలతో సతమతమవుతోంది. మనలాగే అజ్ఞానం, మూఢవిశ్వాసాలు, ఆస్తిపాస్తులూ, ఇళ్లు, ఆడపిల్లల పెళ్ళిళ్ళు, ఉద్యోగం, కుటుంబ గౌరవం మొదలైన వాటితో ఈ సోదరులు సైతం బతుకు పోరాటం చేస్తున్న వాళ్లు అని మనం మరువరాదు.

పోతే...ముస్లిమ్‌లు దళితుల కన్న భిన్నమైనవాళ్ళు అని కూడా నాకనిపించలేదు. హరిజనులు అత్యంత దోపిడీకి గురయిన వాళ్ళనీ, అవమానితులనీ, నిరుపేదలనీ మన విద్యావంతుల్లోని చాలామంది లిబరల్ మేధావులు అంగీకరిస్తారు. కానీ ముస్లిమ్‌ల మీద జరిగే దాడి, అఘాయిత్యాల గురించి వీళ్ళంతా కళ్ళున్న కబోదులు. ముస్లిమ్‌లకు న్యాయబద్ధంగా దక్కాల్సిన అవకాశాల్ని నిరాకరిస్తోన్న అధిక సంఖ్యాకవర్గాల ద్వేషం,

అత్యాచారం, దుష్ప్రచారాల గురించి కూడా మన మేధావులెవరూ, ఏమాత్రం పట్టించుకోరు. ప్రజల మనస్సుల్లో లేనిపోని అనుమానాల్ని, భయాన్ని గొల్పే అభిప్రాయాల్ని కల్గించి వాళ్ళను గుడ్డి ద్వేషానికి బలిపశువులుగా మార్చే ఈ ఫాసిస్ట్ శక్తులకు మన మేధావులు తమ నిర్లిప్తత, నిరాసక్తతలతో మౌనంగా సహాయ సహకారాలు అందిస్తున్నారు. ఇలాంటి సన్నివేశంలో ముస్లిమ్‌లు సహజంగానే ఆత్మ రక్షణ కోసం తమ మతస్థులైన మతాంధులు, మత గురువులు, అవకాశవాద రాజకీయమ్మన్యులు మొదలైన నాయకుల్ని ఆశ్రయించవలసి వస్తోంది. ఈ దేశ ముస్లిమ్‌లు ఇవాళ ఎలాంటి దయనీయ స్థితిలో వున్నారంటే...వాళ్ళను నాశనం చేస్తున్నవాళ్ళే వాళ్ల రక్షకులై పోతున్నారు.

ఈ వికట వికృత సన్నివేశంలో మనమంతా ఏకమై ముస్లిములను పాపపు సంకేతాలుగా పరిగణిస్తోన్న హిందూ మతాంధుల క్రూరత్వాన్ని వ్యతిరేకించాలి. ముస్లిమ్ మతాంధులైన మత గురువుల నుండి ముస్లిమ్ జనాలకు జరుగుతున్న అన్యాయాల్ని సైతం ప్రతిఘటించడం, పైగా ఇలా ప్రతిఘటిస్తూనే అవిద్య, కటిక పేదరికాలకు అసలు మూలాల్ని వెదకాలి. మతగురువులు, మత ఛాందసవాదులు, అవకాశవాద రాజకీయమ్మన్యులు, వీళ్ళలో ఎవరూ కాని కేవల మూర్ఖులు...ఈ దేశంలో ద్వేషం ఎగజల్లుతున్నారు. వీటిని పకడ్బందీగా ఎదుర్కొగల్గిన సాహిత్యం శక్తిమంతంగా రూపుదిద్దుకోవాల్సిన అవసరం వుంది. భవిష్యత్తు గురించి ఆశావహంగా ఉండడం కూడా మనందరి కర్తవ్యం.

*–'ముల్కి' ముస్లిం సాహిత్య ప్రత్యేక సంచిక, 1999*



# టి. పద్మనాభన్ పరిమళించే కథలు

ఏ ఫ్రేములోనూ ఇమడని మలయాళ కథా రచయిత టి. పద్మనాభన్. ఇటీవల ఆయన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డును మరోసారి తిరస్కరించారు. సంచలనం కోసం కాదు, అకాడమీ అవార్డులపట్ల గౌరవం లేక.

లోగడ 1974వ సంవత్సరంలో తన 'సాక్షి' కథాసంకలనానికి కేరళ సాహిత్య అకాడమీ అవార్డు వచ్చిన సందర్భంలోనూ ఇదేతీరు. అయితే ఆయన ప్రతి పురస్కారాన్ని తిరస్కరిస్తాడని కాదు. 1992 లో 'గౌరి' కథాసంకలానికి ఆల్‌లైన్ అవార్డుని, 1974లో 'సాక్షి'కి సాహిత్యప్రవర్తక సహకరణ సంఘ బహుమతిని స్వీకరించారు. కానీ కేరళ సాహిత్య అకాడమీ, కేంద్రసాహిత్య అకాడమీ, సాహిత్యపరిషత్తు అవార్డులను ముట్టుకోలేదు. కారణం ఇవి మొక్కుబడి సంస్థలుగా మారిపోతున్నాయని ఆయన బాధపడతారు.

ప్రభుత్వ సంస్థలన్నా, బ్యూరాక్రసీ వాసనలన్నా, అధికారపార్టీలన్నా ఆయనకు అసలు గిట్టదు. కథల్లో ఏమి రాస్తారో, వాటినే ఆచరించే నిబద్ధుడు ఆయన.

మలయాళ సాహిత్యంలో కేవలం కథా ప్రక్రియకి మాత్రమే అంకితమై వందలకొద్దీ కథలు అందించిన ఏకైక కథారచయిత పద్మనాభన్. 1948లో అచ్చయిన తన మొదటికథ నుండి ఇప్పటివరకు అనేకానేక కథలు రాశారు. 1963 నుండి 1969 వరకు కొన్నేళ్ళపాటు మౌనవ్రతం పాటించారు.

అతని కథలు అనేకం భారతీయ భాషల్లోకి, ఇంగ్లీష్, జర్మన్, ఫ్రెంచ్, రష్యన్

తదితర భాషల్లోకి అనువాదం అయ్యాయి. నేపాల్, ఇంగ్లండ్, జర్మనీ, బెల్జియం, ఫ్రాన్స్, హాలెండ్, స్విట్జర్లాండ్, అమెరికా, కెనడా దేశాలను సందర్శించిన పుష్కలమైన అనుభవం, పుట్టి పెరిగిన కణ్ణూరు మట్టి పరిమళం ఆయన కథల్లో కనిపిస్తుంది. ఆయన కథలకి మరో ఐడెంటిటి అతని కథల్లో అనివార్యంగా కనిపించే ప్రకృతి. ఊరూవాడా, చెట్టూపుట్టా, పక్షుల కిలకిలారావాలు తప్పనిసరిగా అతని కథల్లో రావాలి. అంతే! అది నియమం.

పద్మనాభన్ సాహిత్యజీవితంలోలాగే నిజజీవితంలోనూ అనేక ప్రత్యేకతలున్నాయి. అతను గడిపింది దుర్భరమైన బాల్యం. దుస్సహమైన రోజులవి. తనతోపాటు చదువుతున్న పిల్లలందరూ బడినుండి మధ్యాహ్న విరామ సమయంలో ఇంటికివెళ్ళి ఏదో ఒకటి తినివచ్చేవారు. తన పరిస్థితి అలాంటిది కాదు. ఇంట్లో తిండికి ఏమీ వుండేది కాదు. అందుకని ఆ బాలుడు ఇంటర్వెల్‌లో ఇంటికి వెళ్ళలేక, వెళ్ళినా అక్కడ తినగలిగిన పరిస్థితులులేక బళ్ళోనే తనతోపాటు తెచ్చుకున్న నవలని భోంచేసేవాడు. అలా మొదలైంది అతని సాహితీవ్యాసంగం. ఒంటినిండా గుడ్డలు కట్టుకునే తాహతులేని కుటుంబం వాళ్ళది. అంత దుర్భర పరిస్థితుల్లోనూ రాటుదేరి, పుటం పెట్టబడినతీరులో ఎదిగివచ్చి పునాదిని మరవకుండా కథల్ని సుసంపన్నం చేస్తోన్న రచయిత పద్మనాభన్. ప్రతి కథా దుఃఖాన్ని పిండుతున్నట్టు వుంటుంది. మరోరకంగా చెప్పాలంటే కరుణరస స్ఫోరకమైన కథలకీ, ప్రేమపూరిత రచనలకీ అతను పెట్టింది పేరు. అతని కథానాయకులందరూ ఎక్కడా మాటతప్పరు. మడమ తిప్పరు. ఏ పరిస్థితుల్లోనూ తలవంచని, భుజం దించని మహా స్వాభిమానులు వాళ్ళు. 'మఖన్‌సింగిండె మరణం'లో మఖన్‌సింగ్ అలాంటి వాడే. 'శేఖుట్టి' కథ కరుణకి నిలువెత్తు అద్దం. అతని కథల పేర్లలోనూ ప్రత్యేకతలే! వెలుతురు చిమ్ముతున్న అమ్మాయి (1955), శిలువమీద కథారచయిత (1956), సహృదయుడైన యువకుని జీవితంలోంచి (1961), ఇల్లు కోల్పోయిన స్త్రీ (1983)..ఇలా అనేక కథలు వైశిష్ట్యానికి పెట్టింది పేరు.

దుఃఖపూరితమైన కథరాసినా మళ్ళీ ఆశావాదిగా కారుచీకట్లో కాంతిరేఖల్ని రేఖామాత్రంగానైనా చూపుతాడు. మలయాళ కథా రంగం ఇప్పుడెలావుంది అని ప్రశ్నిస్తే మహాద్భుతంగా వుంది అని వెంటనే సమాధానమిస్తాడు. అతని ప్రారంభదినాల్లోని కథల్లో ప్రబోధాత్మకత ప్రత్యేకంగా రాణిస్తే, తరువాతి కథకి తాత్వికత ప్రధానమైంది.



పద్మనాభన్ 1931 ఫిబ్రవరి ఐదున కణ్ణూరు సమీపంలోని పళ్ళికున్నులో పుట్టాడు. మద్రాసు లా కాలేజీ నుంచి బి.ఎల్. తీసుకుని 1955 నుంచి 1966 వరకు కణ్ణూరులో ప్రాక్టీసు చేశాడు. ఇప్పటి వరకు 13 కథాసంకలనాలు ప్రకటించాడు. ఇప్పటికీ ప్రతియేటా మద్రాసులో డిసెంబరులో జరిగే సంగీతోత్సవాలకి వెళతాడు. కథల్లో అతనెంత అంతర్ముఖుడో బయట అతను అంత గలగలగా మాట్లాడేస్తాడు.

- ఆంధ్రజ్యోతి, ఆదివారం

# తెలుగు సామెతల్లో "జాతర" చేసిన హాస్యం

ఆంధ్రులకు సహజంగానే హాస్యప్రియత్వం ఎక్కువ. సన్నిహితులైన వ్యక్తులు ఏ ఇద్దరు కలిసి మాట్లాడుకున్నా నవ్వులజల్లు వెల్లివిరుస్తుంది. మనం కూడా మన అనుభవంలో హాస్యాన్ని ఆలంబనంగా చేసుకొని నిత్య జీవితంలోని రకరకాల ఒత్తిళ్ళని తగ్గించుకోగల్గుతున్నాం. ఈ ఆధునిక సమాజంలో...డబ్బే ప్రధానమైన ప్రస్తుత పరిస్థితుల్లో....పరుగే ముఖ్యమైపోయిన ఈ రోజుల్లో...ఒక మంచి జోక్ లేదా కార్టూన్ అథవా హాస్యరసస్ఫోరకమైన ఒక రచన మనల్ని ఒకసారి కుదేసి మన శరీర కండరాల్ని రిలాక్స్ చేసి అనిర్వచనీయమైన ఆనందసీమల్లోకి చేరవేస్తుంది. సమస్త రుగ్మతలతో తల్లడిల్లుతోన్న నేటి సమాజానికి హాస్యం ఓ పన్నీటి జల్లు. ఒక సుతిమెత్తని కరస్పర్శ. కష్టాల గాయాల మీద పూసిన ఒక చల్లని మొలాం. తాత ముత్తాతల కాలం నుండి చలామణిలో ఉన్న తెలుగు సామెతల్లో హాస్యం తెచ్చిపెట్టుకున్నట్లుగా కాక అత్యంత సహజంగా కలగలసి వుంది. హాస్యంతో పాటు అపహాస్యం, వ్యంగ్యం, వెక్కిరింపులు, కూడా కలిసి సామెతలకు నిండుదనాన్ని చేకూరుస్తున్నాయి. ఈ నేపథ్యంలో తెలుగు సామెతల్లో పండిన హాస్యాన్ని ఇక్కడ ఒకింత చర్చించుకుందాం.

జానపదులకు పిసినారి వెధవలంటే మంటలా వున్నట్లుంది. లోభులు..వాళ్ళు సుఖపడరు, ఇతరుల్ని సుఖపడన్వీరు (సుఖపెట్టరు) లోభత్వాన్ని అతిశయోక్తిగా చెప్పిన సామెత చూడండి.

'ఇత్తు యిసిరి ఇరున అంబలి కాచి, ఇంటికి నల్గురిని పిలిచి ఇందు చేసినట్లు".



కేవలం ఒకే ఒక విత్తనం తెచ్చి విసిరి ఇరుసంత అంబలి చేసి ఇంటికి నల్గురు చొప్పున పిలిచి విందు చేశాట్ట వెనకటికెవడో. వాడెంత పిసినిగొట్టు అయినా ఈ సామెతను వినేసరికి నవ్వురాకుండా వుండదు. మరొక సామెత "ఇరాట పర్వం మా యింటాయన కొచ్చు, భాగోతం మా బావకొచ్చు, అండ్లదో నుడుగు ఇండ్లదో నుడుగు నాకింతొచ్చు" ఇలాంటి మనుష్యులు కూడా నిత్యజీవితంలో మనకి తారసపడుతుంటారు. ఏ విషయమ్మీదా వాళ్ళకు ధ్యాస వుండదు. లోతుల్లోకి వెళ్ళరు. ఉపరితల స్పర్శతో తృప్తి పడతారు.

'కత్తి తీసి కంపలో వేసి, ఏకు తీసి పొడుచు కుంటానన్నాడట' చాలా తెలివిపరుడు. ఏకుతో పొడుచుకోవడానికి వీడే కావాలా! పెద్ద పొడిచొచ్చినట్లు ఫోజు.

సామెతలు చుట్టాల మనస్తత్వాన్ని కూడా చాలా బాగా వడగట్టాయనిపిస్తుంది. అందులో ఒకటి–"కాలు పట్టుకుని లాగుతుంటే చూరు పట్టుకొని వేలాడుతున్నట్లు' బావుంది. గంతకు దగ్గ బొంత అన్నట్లు యింటి యజమానికి తగిన చుట్టం. ఎంత మంచివాడయినా మూడురోజులకు మురికి చుట్టమవడం ఖాయం. చుట్టం ఆకలి మంచానికెరుక అని వూరకే అన్లేదు కదా! వీడెవడో మానం, మర్యాదా మరిచిన చుట్టంలా వున్నాడు. ఎన్ని రోజుల్నుంచి తిష్ట వేశాడో గాని యజమాని కాళ్ళు పట్టుకొని లాగుతున్నాడు పీడ వదిలించుకోవాలని. వాడేమో చూరుపట్టుకొని వేలాడుతున్నాడు. దృశ్యం కళ్ళముందు బొమ్మకట్టిం తర్వాత నవ్వకుండా వుండలేం.

"కోళ్ళను తింటారా అంటే, లేదు బొచ్చు పారేస్తాము అన్నట్లు" అనే సామెత మరో హాస్యోక్తి. ఎదుటి వ్యక్తి మాంసాహారా, శాకాహారా అన్నది తేలాలి. అందుకని కోళ్ళను తింటారా అని ప్రశ్నించారు. అవతలి వాడేమో చాలా తమాషాగా రకీమని బొచ్చు పారేస్తాము అంటున్నాడు. అంటే మేం మాంసం తింటామని డైరెక్టుగా చెప్పుబుద్ధి కాకపోవడం కాదూ?

"గురువు నిలుచుండి తాగితే శిష్యుడు పరుగెత్తి తాగుతాడు." అన్నది ఇంకొక హాస్య సామెత. గురు శిష్యులిద్దరూ ఒకరికొకరు సరిపోయారు. లేదా మించి పోయారు. ఇంక అది పాఠశాల కాదు పానశాల. గురువు నిజానికి తాగకూడదు. అథవా ఒకటీ, అరా బలహీనతలున్నా బయటికి ప్రదర్శించరాదు. ఈ సామెతలోని గురువులుంగారికి అవేవీ ఆనవు. ఏకంగా నిలుచుండి తాగేస్తున్నాడు గటగటా. ఇంక వీరి దగ్గరి శిష్యరికం

ఎలా వుంటుందో చిత్తగించండి. అంతేవాసి పరుగెత్తుతూ తాగుతున్నాడు. వాడు అదే వాసి అనుకున్నట్లున్నాడు.

'గోకుడుకు గీకుడే మందు'...నిజమే! గజ్జి వున్న వాడికి లజ్జ వుండదన్నారు. బర్ర బర్ర గోక్కుంటారు బాధ తాళ లేక...ఇది సామెతల స్రష్టల దృష్టిలో పడింది. వెంటనే పై సామెత చెప్పారు. అయితే ఈ గీకుడు మాత్రం గోకుడు మందు కాదు. తమాషాగా చెప్పారనే అర్థం చేసుకోవాలి.

మన చుట్టుపక్కల కొందరుంటారు. స్వవచన వ్యాఘాతకులు వాళ్ళు. వాళ్ళేం మాట్లాడుతున్నారో వాళ్ళకే తెలీదు. "కోడలికి బుద్ధి చెప్పి అత్త తెడ్డు నాకిందట" అన్నట్లు "తల్లిని తిట్టకురా నీయమ్మ నాయల" అంటారు. ఓ వైపు కన్న తల్లిని తిట్టకూడదంటూనే మరోవైపు నీయమ్మా నీవైపూ అంటున్నారు. ఎటు వైపు అయితే అటే! ఎటు వాటం అయితే అటే!!

మరో రకమైన వ్యక్తిని చూద్దాం. ఆయమ్మకు విపరీతమైన ఉత్సాహం. జాతరకు వెళ్ళాలనీ, ఇంట్లో వున్న చీరలన్నీ కట్టుకోవాలనీ వుబలాటం. ఏ చీరని వదల్లేదు, అన్నీ చుట్టుకుంది. ఏమవుతుంది మరి? చూద్దాం.

"తీరు తీరు బట్టలు కట్టుకొని తిరునాళ్ళకు పోతే, ఉరికొక్క చీర ఊసిపోయిందట" ఉంటుందా మరి?

ఇక అతి జాగ్రత్త పరుల్ని చూసి ఏమన్నారో గమనిద్దాం. "ఏరు ఏడామడ వుండగానే చీర విప్పి చంకల పెట్టుకున్నట్లు" ఇందాకటి సామెతలోని ఇంతికేమో ఉరికొక చీర ఊసిపోయింది. ఈ సామెతలో కన్పించే స్త్రీకి ముందు జాగ్రత్త ఎక్కువ. తొందర పడే రకం. ఏరు వచ్చాక ఏట్లో దిగి నీళ్ళు ఎక్కువగా వుంటే మనం గుడ్డలు పైకి పట్టుకుని దాటుతాం. ఈ మహాతల్లి ఏరుయింకా ఏడామడలు వుండగానే చీర విప్పనూ విప్పింది...చంకలో పెట్టనూ పెట్టింది..ఇంక చూపరులకు నవ్వురాదూ!

"నీ పప్పూ, నా పొట్టూ కలిపి ఊదుకుని తిందాం" అన్నాడట ఒక మహనీయుడు. వీడు అరిస్టాటిల్ చెప్పిన సంఘజీవికన్నా గొప్ప సంఘజీవి. వీడి సంఘీభావం చూడండి. మనల్ని పప్పు తెమ్మంటున్నాడు. వీడేమో వుత్త పొట్టు పట్టుకొస్తాడు. చూసేవాళ్ళకేమని పిస్తుంది? పాపం వీడు కూడా తన వంతు కలుపుతున్నాడు అనిపించదూ!

"నీవు వెడితే బూతులు తిట్టివస్తావు...నేను వెళితే అమ్మను ఆలిని తిట్టి వస్తాను" అన్నాడట. వాడి దృష్టిలో కన్న తల్లినీ, కట్టుకున్న పెళ్ళాన్నీ తిట్టడం బూతులు కావన్న మాట. శభాష్! ఇల్లాంటి వాళ్ళు కూడా తగుల్తారు మనకి.

"పప్పు శబ్దంబునకు ఘృత శబ్దంబు పరంబగునప్పుడు అపాన వాయువు ఆదేశంబగు" అనేది మరొక సామెత. వీడెవడో ఈ సామెత కర్త పేరడీల పెద్ద మనిషి వున్నట్లున్నాడు. పదాల గారడీల వ్యక్తిలా తోస్తున్నాడు. వీడికి అవకాశం వుంటే మరో వ్యాకరణం రాసేస్తాడు. పెద్దయ్యసూరి అవుతాడు.

"పప్పులో ఉప్పు వేసేటప్పుడు చెప్పేయవే అంటే చెప్పు వేసి తీసి అత్తకు అంచుకు పెట్టిందట కోడలు" మాంచి కోడలు. అవకాశం అంది వచ్చింది కదా! చెప్పేయమంటే చెప్పి వేయమని అర్థం. ఈవిడేమో చెప్పు వేయమని అర్థం చేసుకుంది కావాలనే! అత్త మీద అక్కసుమరి.

"నేల మీద రాసిన బూరెను అంత తింటావా ఇంత తింటావా అన్నట్లు" మళ్ళీ పిసినిగొట్టు మీద విమర్శ. నిజమైన బూరెలిస్తే గుండె ఆగి చస్తాడు వెధవాయి. అందుకనే నేలమీద రాసి నోరూరింపచేస్తున్నాడు పూరికినె. మరో తమాషా సామెత, "పిల్లా పిల్లా పెట్టనిస్తావా అని రావూరు రసికుడడిగితే నీకు అమ్మనయ్య అన్నదట నెల్లూరి నెరజాణ!"

రావూరి రసికుడు పెట్టనిస్తావా అన్నాడు. శ్లేషని విశ్లేష చేసి చూద్దాం. పెట్టనిస్తావా అంటే పెట్టనిస్తావా, పెట్టను యిస్తావా అని రెండర్థాలు. నెల్లూరి నెరజాణకేం తెలివి తక్కువా? రెండాకులు ఎక్కువే చదివి, ఆవిడా రెండర్థాలొచ్చేలా జవాబిచ్చింది. అదీ ముక్కు మీద గుద్దే ముఖం పచ్చడయ్యేలా, నీకు అమ్మనయ్య అంది. ఒకర్థం నీకు అమ్మలాంటిదాణ్ణి అని...మరో అర్థం...నీకు అమ్మను...నేన్నీకు కోడిని అమ్మబోవటం లేదు అని...

మన అనుభవంలో కొందరు గమ్మత్తైన ఆడవాళ్ళను గమనిస్తాం. వాళ్ళు గయ్యాళులు. గంప గయ్యాళులు. గయ్యాళి తనమంతా గంపగుత్తకు తీసుకున్నట్లే వుంటారు. తిట్ల దండకం ఎత్తుకున్నారంటే ఉట్లు తెగుతాయి. మగణ్ణి కూడా లెక్క చేయరు. ఓ రోజు ఇలాంటి స్త్రీ ఒకతె పురాణం వింటానికి వెళ్ళింది. తిరిగొచ్చింది. భర్తకు ఆశ...పురాణం వినైనా భార్య మారిపోయిందేమో అని.. ఆశగా అడిగాడు అక్కడ ఏం చెప్పారని. ఆమె సమాధానం ఎప్పట్లానే వచ్చింది. భర్త ప్రశ్న, భార్య జవాబు వెరసి సామెతను చూడండి.

"పురాణంలో ఏం చెప్పారే అంటే అక్కడా నీ మొగాన మొద్దులు బెట్ట అన్నారు అందిట."

"మగ్గం గుంతలో పాముంది మగాళ్ళుంటే పిలవ్వే అన్నాడట" ఇప్పుడు మరో సామెత.

ఇంక పిరికి పందలైన భర్తల గురించి విందాం.

"మాణవాధీశర మణువు నాలికవాడు' అని సెట్టివాడు పురాణం చదివితే, అబ్బో అంత పెద్ద నాలుక ఎవరికుంది? ' అని ప్రశ్నించగా యినుము యిదర్భదేశమున యీరుడికుండెను' అన్నాడట యింకొక శ్రోత.

నిజానికి ఈ సామెత యిలా ఉండాలి. మానవాధీశ్వర మనవు నాలవ వాడు. తామసుండనగ వినుము విదర్భ దేశమున వీరుడికుండెను భక్త–ఇది భాగవత పద్యం.

జానపదుల అపశబ్దాల్ని తప్పుపట్టడం కాదిక్కడ ప్రధాన ఉద్దేశం. వాళ్ళ మాట తీరు వల్ల గ్రాంథిక భాషలోని సొగసులు ఎలా మారాయన్నది ముఖ్యం. కావ్యభాషలోని సొగసు చెడిపోయినట్లనిపించినా అపశబ్దాలు సైతం అప్పుడప్పుడు లేని అందాన్ని తెచ్చి పెడతాయి. పల్లెవాసులు గొప్ప పదాలను గొప్పగా వుచ్చరించలేక పోవచ్చుగానీ వాళ్లకు తెలిసినంతగా జీవితం లోతులు మాత్రం మనకు తెలియవు.

"వండుతూ వుండగా వాంతి అవుతున్నది అంటే వుండి భోజనం చేసి పొమ్మన్నదట"–ఇదొక హాస్యపు సామెత. ఆమె గొప్ప వంటలక్కలా వుంది. వంట లక్కలా చేసిందో, బొగ్గులా మార్చిందో తెలీదుగానీ వండేటప్పుడే వాంతులొస్తున్నాయి భళ్ళున. ఇంకా చాలదన్నట్లు ఆ మహద్భాగ్యానికి వుండి భోజనం చేసి పొమ్మని ప్రార్థన. ఘనాపాఠి ఆఫ్రికాలోని ఏ ఘనాదేశంలో వుండాల్సింది. ఈగలూ, దోమలూ తింటారు కదా వాళ్ళు. ఈమె చేతి వంట తింటే అంతే సంగతులు...చిత్తగించవలెను. టపా కట్టవలెను. అడ్రసు గల్లంతు చేసుకోవలెను.

"విబూతి పట్టెలు పెట్టుకుంటే విష్ణుమూర్తి వనుకున్నానే, ఆంజనేయులు వటోయ్ వెంకటేశ్వర్లూ!" ఇదీ సామెతే! ఇలా సంభాషించే వ్యక్తులు సవాలక్ష మంది వున్నారు. హాస్యం యిక్కడ పెట్టని భూషణంగా అలరారి సామెతని శక్తివంతం చేసింది. విభూతి పట్టెలకూ విష్ణుమూర్తికి సంబంధమేలేదు. పైగా మరలా విష్ణ్వాంశ ఆంజనేయులిక సల్లేదు. ఇంకా వేంకటేశ్వర్లు అని పిలవడం పొట్ట చెక్కలయ్యేట్లుగానో, చెక్కబద్దలయ్యేట్లుగానో నవ్వకుండా వుండగలమా? ఇలా మనల్ని రసజగత్తులో ఓలలాడించి భారమైన మన హృదయాల్ని తేలికపరచగలిగిన శక్తి, ఈ సామెతలదే!



"సర్వే జనాస్సుఖినోభవంతు అంటే, సర్వేవాళ్ళేనా మా సంగతేంటి అన్నారట రెవెన్యూ వాళ్ళు". ఇదొక ఆధునిక సామెత. బ్రిటిష్ పాలన వల్ల రకరకాల పరిపాలనాశాఖలు చలామణిలోకొచ్చాక పుట్టిన సామెత. రెవెన్యూ వాళ్ళకి ఆశ దోశ..అన్నట్లు విపరీతమైన పేరాస వుంటుందేమో! సర్వేజనాస్సుసుఖినోభవంతు అంటే సర్వ జనులకు సుఖం కల్గుగాక అని. కాని వాళ్ళు సర్వే డిపార్టుమెంటులోని జనాలకే సుఖం గల్గుగాక అని అర్థం చేసికున్నట్టున్నారు. వెంటనే మరి మా సంగతేం అని ప్రశ్నించారు. మానవ మనస్తత్వాన్ని బాగా విశ్లేషించి చూపగల చిల్లగింజ సామెత అనవచ్చు.

ఇలా వేలకొద్దీ తెలుగు సామెతల్లో నిండైన హాస్యం నిలువెల్లా కనబడి వినేవాళ్ళని విభ్రమకు గురిచేస్తుంది. మన కనుబొమ్మల్ని ముడి వేయిస్తుంది. నిజానికి యిది తెలుగు సామెత లక్షణం కాదు. తెలుగు వాడి గుణం. ఆంధ్రులకు వ్యంగ్యమంటే ప్రాణం. హాస్యం అంటే పంచప్రాణాలు. ఎత్తి పొడుపుల్లేని వాక్యం తెలుగు వాడికి రుచించదు. వాచ్యానికన్న వ్యంగ్యానికి, హాస్యానికి వున్న పదును తెలుగు వాళ్ళకి బాగా తెలుసు. ఇతర భారతీయ భాషల్లోని సామెతల్లో ఇంత హాస్యం లేదు. ఇంత మొత్తంలో పదాల విరుపు కన్పించదు. హాస్యం తెలుగువాళ్ళ ఆస్తి. హాస్యం ఆంధ్రులకు ఆసక్తి. జీవితంలో కనిపించే ఈ సజీవ హాస్యమే సామెతల్లోకి ప్రసరించి తెలుగుసామెతకు మరో పర్యాయపదం హాస్యం అన్నంతగా పెనవేసుకుపోవడం ఆశ్చర్యమే మరి!

*– జాతర, 1-5-2007*

# తెలుగు, తమిళ పొడుపు కథలు - ఒక పరిశీలన

ఏదైనా ఒక విషయాన్ని ఆధారంగా చేసుకొని రెండు లేదా అంతకన్న ఎక్కువ భాషా, సాహిత్యాల్ని పోల్చడం తులనాత్మక పరిశీలనలో ఒక పద్ధతి. అయితే ఈ భాషాసాహిత్యాలు భారతీయ భాషాసాహిత్యాలు కావచ్చు లేదా భారతీయేతరమైనవీ కావచ్చు. భారతీయ భాషాసాహిత్యాల తులనాత్మక పరిశీలనతో ప్రక్రియల పరస్పర వివేచనం విశ్వమానవ దృక్పథానికి దారితీస్తుంది.

తులనాత్మక పరిశీలనలవల్ల కొన్ని మౌలిక తత్వాలు ఆవిష్కృతమవుతాయి. మనిషి ఏ భాషీయుడైనా, దేశీయుడైనా అతని కష్టసుఖాలు, సాధక బాధకాలు, జీవన వైఖరులూ, ఆరాటపోరాటాలు, రుచులూ అభిరుచులూ, అనుభవాలూ, అనుభూతులూ రమారమి సమానం అన్న ప్రమాణమైన విషయం విదితమవుతుంది. సమస్త మానవ జాతి ఒక్కటే అన్న సిద్ధాంతం బలపడుతుంది. 'వసుధైక కుటుంబం' అనే భావన నిలబడుతుంది. అన్యభాషీయుల పట్లా, ఇతర దేశీయుల పట్లా సదవగాహన ఏర్పడుతుంది. మనిషి మనస్సు సంకుచితం, భారతీయ సమాజం సంక్షుభితం అవుతోన్న ప్రస్తుత సభ్య సమాజంలో తులనాత్మక పరిశీలనలు సంచలనాత్మకంగా సాగాలి. అఖండమైన భారతీయాత్మ ఒక్కటే అని ప్రతి ఒక్కరూ గుర్తించి, అంతర్జాతీయ దృక్పథానికి చేరువ కావాలి.

పైగా తులనాత్మక వివేచనంతో ఆయా భాషా సాహిత్యాల సాదృశ్యాలు మాత్రమేకాక వైదృశ్యాలూ వెల్లడవుతాయి. ఏ భౌగోళిక పరిస్థితుల నేపథ్యంలో ఏయే పరిస్థితుల పరోక్షంలో ఆయా ప్రత్యేకతలు ప్రభవించాయో తెలుసుకొనే అవకాశం ఈ పరిశీలనల వల్ల కలుగుతుంది. ఈ వెలుగులోనే రెండు భాషల్లోని పొడుపు కథల్ని పరిశీలించడం ప్రస్తుత వ్యాస లక్ష్యం.

మేధకి మేత పొడుపు కథ. జానపద సాహిత్యంలో అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్న జంట ప్రక్రియలు సామెతా, పొడుపు కథలు. జానపదుల్లో అత్యధికులు అక్షరాస్యులు కాక పోవచ్చు. అంతమాత్రం చేత వాళ్ళు అనుభవ శూన్యులు కారు. కమ్మని కవితాత్మ లేని వాళ్ళు కారు. 'ఎకానమీ ఆఫ్ వర్డ్స్' అన్న సిద్ధాంతమూ, 'ది ఛాయిస్ ఆఫ్ బెస్ట్ వర్డ్స్ యిన్ ద బెస్ట్ ప్లేస్' అన్న విషయమూ పొడుపు కథల్లో అడుగడుగునా కనిపిస్తుంది. పొడిపొడి అక్షరాల్లో అసంఖ్యాకమైన, వైవిధ్యపూర్ణమైన అనుభవాల పరంపరల్ని చెప్పారు. అవే పొడుపుకథలు. ఇవి పొదుపు కథలుకూడా! పల్లీయులకి పొడుపు కథ ఆట విడుపు. వాళ్ళు చేసే శారీరక శ్రమకి ఒకింత తెరిపి. ఇది పదాలకు పొదుపు. పదునైన బుద్ధికి పొడుపు. ప్రశ్నగా ప్రభవించిన పొడుపు కథ పల్లీయుల జ్ఞానతృష్ణకి చక్కని తార్కాణం. మానవుడు ప్రశ్నించడం ప్రారంభించడంతోటే విజ్ఞాన పరిధి విస్తృతమైంది. అలాంటి ప్రశ్న ప్రహేళికకి బహిఃప్రాణం. ఇక కవిత్వం దాని ఆత్మ. అల్పాక్షరాల్లో అనల్పార్థాల్ని నిష్పన్నం చేయడం దీని లక్ష్యం. పొడుపు కథల్లో వర్ణించబడని వస్తువు లేదేమో! గ్రామీణుల స్పృహలోని పరికరాలూ, పరిసరాలూ, ఆధునిక కవిత్వానికి ఏమాత్రం తీసిపోని పదచిత్రాలూ, ప్రతీకలూ, మినీ కవితల్లోని సౌదామినీ కాంతులూ, కొనమెరుపులూ, నాన్యతోదర్శనీయమైన ఉపమలూ..ఒక్కటేమిటి సమస్త ప్రకృతీ పొడుపు కథల్లో పలు రకాలుగా, బహు ముఖాలుగా భాసిల్లింది. నడుముచుట్టూ ఉన్న మొలతాడును-'కొండ చుట్టూ తిప్పతీగ' అన్నారు. చెవిలోని గుబిలి 'చీకటింట చింతపండు' లా తోచింది జానపదులకి. ముక్కులోని చీమిడి 'చిట్టి పిడతలో గట్టి పెరుగు' లా కన్పించడం ఎంత చిత్రం! ఎండావానల్లో ఉపయుక్తమయ్యే ఛత్రం 'ఇంట్లో మొగ్గ' 'బయట పూవై' వికసించింది పల్లీయుల కళ్ళకి. కోడిగుడ్డుని 'వెండి గిన్నెలో బంగారం' అనడం వాళ్ళకే చెల్లుతుంది. సమస్త ప్రకృతీ బిందువులో సింధువులా ఒదిగిపోతుంది. జ్ఞానవిదులైన జానపదుల ఆలోచనా రీతులకు, వర్ణనా బాహుళ్యానికి పొడుపు కథ తెరిచిన కిటికీ. గ్రామీణుల చేతిలో అతి రమణీయంగా తీర్చిదిద్దబడిన సహజసుందర శిల్పం పొడుపుకథ.

తమిళంలో 'పొడుపుకథ'ని విడుకదై అంటారు. అంటే-'విడుపు కథ' అని అర్థం.

ఈ వ్యాసంలో రెండు భాషల్లోని ముఖ్యమైన పొడుపు కథల్ని రేఖామాత్రంగా పరిశీలించడమే ప్రధానోద్దేశ్యం.

**1. చంద్రుడు**

'చట్టెడు/పుట్టెడు శనగల్లో ఒకటేరాయి'
'జిల్లేడు పువ్వుల్లో జగన్నాథుడు'
దొడ్డెడు ఆవులు-ఒక పెండకడి'
'పుట్టెడు బియ్యంలో ఒక మెరికె/రాయి'

'వెయ్యి మందిగల దొడ్లో ఒకటే నువ్వుగింజ' మొదలైన పొడుపు కథల్లో చంద్రుడు అనేక రకాలుగా ఆవిష్కరించబడ్డాడు. మరోచోట 'కొండమీద వెండి బొమ్మ' లా దర్శనమిచ్చాడు. పైగా 'చుక్కలుండే ఒక రాజ్యం, చెప్పలేని విశాలమైనది.

భామ యొక్కతే ఏలుతున్నది. ఆమె పేరేమి? అంటే తెలుగులోనే ప్రశ్నార్థక ప్రహేళిక మరోటి.

'రచ్చబండమీద రాజు కూర్చుండె' అని అమాంతం నెలరాజుని ఇలరాజుని చేసి చెప్పారు ఇలా:

తమిళంలో 'ఎట్టాద రాణి యిరవిల్ వరువాళ్
పగలిల్ మఱైందు విడువాళ్', అన్నారు.

'అందని రాణి రాత్రి వస్తుంది-పగలు మాయమైపోతుంది' అని అర్థం.

పై అర్థంతో ఏకీభవించే పొడుపుకథ తెలుగులో ఉంది. అది :

'పొద్దుందాక పడుకొని తెల్లందాక లేస్తుంది' అనేది.

'పుడుతూనే రెండు కొమ్ములు, పెరుగుతూనే బోడితల' అని పాడ్యమి నించి పౌర్ణమి వరకు చంద్రకళల్ని పరిశీలించి తెలుగులో పొడుపు కథ చెప్పారు.

తమిళంలో-'ఎంగళ్ వీట్టు కొల్లైయిలే.

మొట్టైయాండి ఎట్టి ఎట్టి పార్క్కిఱాన్' అన్నారు. (మా యింటి పెరట్లో బోడిసన్యాసి అందకుండా తొంగి చూస్తున్నాడు).

'ఉయరత్తిలే ఒరు రోజా, ఉలగెంగుం అదే రోజా'
(ఎత్తులో ఒక గులాబీ, లోకమంతా అదే గులాబీ)
'ఎంగ వీట్టు కిణత్తిలే వెళ్ళి కిణ్ణం మిదక్కుదు'



(మా ఇంటి బావిలో వెండి గిన్నె, తేలుతోంది)
'ఒరు అగప్పె మావాలే ఊరెల్లాం కలియాణం'
(ఒక్క గంటెడు పిండితో ఊరంతా పెళ్ళి)
'పట్టు కుడైపోల్ పూ పూక్కుం-పిటిక్కపోనాల్ ఎట్టాదు'
(పట్టుగొడుగులా పూలు పూస్తుంది-తెంపబోతే అందదు)
'ఓడువాన్ నిఱ్క మాట్టాన్, ఒళిందుకొళ్ళ్వాన్ వెళివరువాన్'
(పరుగెడతాడు నించోడు, దాక్కుంటాడు బయటికొస్తాడు)
'పాల్ యిల్లామల్ పరుక్కిఱదు, నోయ్‌యిల్లామల్ ఇళైక్కిఱదు'
(పాలు లేకుండా పెరుగుతాడు, నొప్పి లేకుండా తరుగుతాడు.)

(వరుసగా శుక్ల, కృష్ణ పక్షాల గురించి)-అనేవి పొడుపు కథలు. తెలుగులో : 'పెరిగే పక్షంలో అది తరగకుండా పెరుగుతుంది. తరిగే పక్షంలో అది పెరగకుండా తరుగుతుంది.' అన్నారు ఈ సందర్భంగా.

చంద్రుడు తెలుగులో 'వెండిబొమ్మ, మెరికె, రాయి, జగన్నాథుడు, రాజు, రాణి, బోడితల సన్యాసి' మొదలైన ఆకృతుల్లో అభివర్ణించబడితే; తమిళంలో 'గులాబీ, వెండిగిన్నె, పట్టుగొడుగు, రాణి, బోడి సన్యాసి' ప్రభృతి రూపాల్లో అభివ్యక్తీకరించబడ్డాడు. చందమామని వర్ణించే ఉపమానాలు మారాయి కానీ, భావంలో ఐక్యత ఉంది.

**2 సూర్యుడు**

'అక్కడక్కడి బండి, అంతరాల బండి
మద్దూరు సంతలో మాయమైన బండి'
'తునికిపండు తుస్సుమంటే
పసులకాడి పిల్లలు పయనమైరి' అని తెలుగులో పొడుపు కథలు. తమిళంలో 'కాలైయిల్ వంద విరుందాళి, మాలైయిల్ మఱైందు విట్టార్' – 'ఉదయం వచ్చిన అతిథి, సాయంత్రం మాయమయ్యారు' అని చెప్పారు.

'వత్తి చమురు లేని ఒకటే పెద్దవ్వ/మహాగొప్పదివ్వ' అంటూ సూర్యుణ్ణి 'తెలుగులో పోలిస్తే, తమిళంలో 'తిరి యిల్లా విళక్కు-ఎదు?' – 'వత్తి లేని దీపం-ఏది?' అంటూ ప్రశ్నించారు. తెలుగులో పెద్దవ్వగా సూర్యుణ్ణి పోల్చడం...ఆయన పెద్దవాడు, అనుభవజ్ఞుడు, సృష్ట్యాదినించీ ఉన్నవాడనీ చెప్పడం, ఇంకా 'వంకలో వన్నెకాడు', 'ఒంటరిగా తిరిగేవాడు', అంటూ మరికొన్ని ఉన్నాయి.

### 3. ఆకాశం : చుక్కలు

'ఊరికంతా ఒకటే గది/దుప్పటి' తెలుగు పొడుపు కథ

'ఊరుక్కెల్లాం ఒరే తుప్పట్టి'– ఊరికంతా ఒకే దుప్పటి – తమిళం.

రెండూ సమానం. అంతరం అంతగా లేదు. తెలుగులో అదనంగా గదిలా భావించడం తప్ప. అయితే తమిళంలో–

'ఎన్నై శుట్రి ఒరు కోట్ట ఉండు,
నాన్ కిట్ట పోనాల్ అదు ఎట్ట పోగుం' అన్నారు.

(నన్ను చుట్టి ఒక కోట వుంది
నేను దగ్గరికెళితే అది అందకుండా పోతుంది)

ఇందులో ఆకాశం అందని కోటలా భావించడం జరిగింది. తెలుగులో మరో పొడుపుకథలో ఆకాశాన్ని గుడిగోపురాల్లా పోల్చడం జరిగింది. అది :

'ఎంతెంత గుడి, ఈశ్వరుని గుడి, కొండంత గోపురం కదలించలేము' తమిళంలో అందని కోటలా చెప్పబడిన మిన్ను ఆడ వీల్లేని తోటలానూ పోల్చబడింది.

'ఎంగళ్ తోట్టం పెరియ తోట్టం
ఏఱి విళైయాడ ఇడం ఇల్లై'

(మా తోట పెద్ద తోట, ఎక్కి ఆడటానికి స్థలం లేదు) ఇంకా కాళ్ళులేని పందిరిలాగా, పిడిలేని గొడుగులాగా స్ఫురించింది తమిళులకి; ఉదా: 'కాల్ ఇల్లాద పందలై, కాణక్కాణ వినోదం'.

(కాళ్ళు లేని పందిరిని, చూడ చూడ వినోదం)

'పిడి ఇల్లాద కుడైయై, తొడ ముడియవిల్లై'

(పిడి లేని గొడుగుని పట్టుకోలేము)

ఆకాశమూ, చుక్కల గురించిన ఉమ్మడి విషయాలు సైతం ప్రస్తావించబడ్డాయి. 'నాన్న డబ్బులెక్కపెట్టలేను, అమ్మ చీర మడత పెట్టలేను' అనే తెలుగు పొడుపు కథకి అక్షరశః పోలినది తమిళంలో వుంది.

'అమ్మా పుడవైయై మడిక్క ముడియాదు
అప్పా పణత్తై ఎణ్ణ ముడియాదు'

'అమ్మ చీరని మడవలేము–అబ్బ డబ్బుని ఎన్నలేము' అని అర్థం.

'అందరాని వస్త్రంపై అన్నీ వడియాలే/వడగళ్ళే'



'చెట్టునిండా పువ్వులు, ఎంత కొట్టినా రాలవు'

'రాత్రి సిగమల్లలు గిన్నె కిందున్నాయి. తెల్లారే సరికి లేవు' మొదలైన మన పొడుపు కథల్లో చుక్కలు పుష్పాలుగా, వడియాలుగా, వడగళ్ళుగా దర్శనమిస్తున్నాయి.

'ఆళ్ ఏఱాద మలైయిల్ ఆయిరం పూ పూత్తిరిక్కు'.

(మనిషి ఎక్కని కొండమీద వేల పూలు పూచివున్నాయి)

'నీల నిలత్తిల్ నిత్తిల ముళైగళ్' (నీలంపు నేలలో ముత్యాల మొలకలు).

(రాత్రంతా పూలవనం, పగలంతా పుత్తవనం) – అనేవి తమిళంలో సాటివి. ఇలా ప్రాకృతికమైన పలు విషయాలు పొడుపు కథల్లో అందంగా చెప్పబడ్డాయి.

### 4. కన్ను

'అక్కా చెల్లెళ్ళ అనుబంధం, ఇరుగూ పొరుగూ సంబంధం
దగ్గర దగ్గర ఉన్నారు, దరికి చేరలేకున్నారు'

'అక్కాచెల్లెళ్ళు ఏడుస్తారు, అయితే దగ్గర చేరలేరు'–తెలుగు. కళ్ళు ఒకదానికొకటి నికటంగా ఉన్నా, మరింత దగ్గరికి రాలేరని ప్రకటించారు. 'శాయ్ంద మలై ఓరత్తిలే, ఇరువర్ నెరుంగి ఇరుక్కిఱార్' – వాలిన కొండకి ఓరగా, ఇద్దరు దగ్గరగా వున్నారు' అని తమిళ పొడుపు కథ.

'ఇరండు తోట్టం నాంగువేలి, పూ పూత్తాల్ పూందోట్టం పాళ్' (రెండు తోటలు నాలుగు కంచెలు, పూలు పూస్తే పూదోట పాడు) అన్నారు మళ్ళీ. రెండు తోటలంటే నయనద్వయం. కళ్ళని కాపాడే రెప్పలు నాలుగూ కంచెలు, పూలు పూయడం తోటకి అందరం, నిండుదనం కల్గిస్తుంది. కానీ.... ఈ తోటల స్థితి వేరు. ఇక్కడ పూలు పూస్తే కంటితోటంతా నాశనమవుతుంది. కంట్లో పువ్వు పడితే దృష్టికి భంగం.

'క్రిందపలక, పైన పలక, పలకలసందున కులుకుల పాప'

'బావిలో పిచ్చుక, బంగారు పిచ్చుక, ఎంత చూసినా బయటికి రాదు' అనేవి కంటిపాపల గురించి చెప్పబడ్డాయి. తమిళంలో కంటిపాపని నల్లని చేపలా పోల్చారు. 'పాలాట్రిల్ కఱుప్పు మీన్ మేయుదు' – 'పాలవాగులో నల్లని చేప మేస్తోంది' అని 'ఎన్నోడు ఇరుక్కుం చిఱు మణిఎనక్కు తెరియాదు, ఆనాల్ ఉనక్కు తెరియుం' 'నాతో వుండే చిన్న మణి నాకు తెలియదు, అయినా నీకు తెలుస్తుంది' అంటూ కృష్ణమణిని చిన్న మణిలా పోల్చారు. తెలుగులోని 'బావిలో పిచ్చుక, బంగారు పిచ్చుక' అనడం

కన్న 'పాలవాగులో నల్లని చేప' గా భావించడం భావ్యంగా ఉంది. కంటిపాప బంగారు వన్నెలో ఉండదు. పైగా కంటిని 'బావి' గా భావించడం కంటె పాలవాగు అనడం ఉచితం. కారణం. కంటి పాప చుట్టూ తెల్లని రంగు ఉంటుంది.

'చిన్నచిన్న తలుపులు, కిటకిట తలుపులు,

కిటారు తలుపులు, ఎప్పుడు మూసిన చప్పుడు కావు' అనేది కంటి రెప్పల గురించిన పొడుపు కథ తెలుగులో.

తమిళంలో 'శిఋ శిఋ కదవుగళ్ శెయ్యాద కదవుగళ్,

తిఱ్యక్క్ అదక్క శత్తం శెయ్యాద కదవుగళ్' అన్నారు.

'చిఋ చిఋ తలుపులు, చేయని తలుపులు

తెరిస్తే మూస్తే శబ్దం చేయని తలుపులు' అని అర్థం.

**5. నాలుక**

'కిందొక పలక, పైనొక పలక

పలకల నడుమ మెలికల పాము' అని తెలుగు పొడుపు కథ. ఇందులో నాలుక 'మెలికలపాము' గా పోల్చబడింది. తమిళంలో–'మేల్ పలగై కీళ పలగై, నడువిల్ నెళిపాంబు' – పైన పలక కింద పలక, నడుమన వంగే పాము' అన్నారు. ఈ రెండూ సాటి పొడుపు కథలే!

'గూట్లో గులాబి పూవు, ఎంత గుంజినా రాదు'

'గూటిలో కప్ప, పీకితే రాదు'

'గూటిలో గువ్వ గుంజినా రాదు'

'గూడులో ఒక చిన్న ఆకురాయి వున్నది. దానినెంత గట్టిగ లాగిన బయటికి రాదు'.

'నూతిలో పాము నూరు వరహాలిచ్చినా బయటికి రాదు'

'మీ యింటి మధ్య మా యింటి మధ్య వేసిన చీర యిప్పటికి ఆరదు.

'వగలాడి రాణికి వాకిట్లో కాపలా'

'ఆ ఆటకత్తె ఎప్పుడూ లోనే నాట్యం చేస్తుంది.

'నరంలేని నారాయణయ్య నాలుగు విధాలు'–ఇలా రసన రకరకాల రచనకి లోనయ్యింది. గులాబిపువ్వు, కప్ప, గువ్వ, చిన్న ఆకురాయి, పాము, వగలరాణి, తడి ఆరని చీర, ఆటకత్తె, నరంలేని నారాయణయ్య...ఇలా ఎన్నెన్ని ఔపమ్యాలో నాలుక విశ్వరూప సందర్శనానికి.

'కొట్టైయై శుట్రి మదిల్ శువర్, ఉళ్ళే మఱైందిరుక్కిఱాన్ వేట్టైక్కారన్' (కోటని చుట్టి ప్రాకారం, లోన దాగివున్నాడు వేటకాడు) అని తమిళం, తణ్ణి యిల్లా కుట్టైయిలే, తత్తళిక్కుం కెండైమీన్' అని మరోటి.

(నీళ్ళు లేని గుంటలో, పోరాడే తాజా చేప)

'వేలైక్కారి కెట్టిక్కారి వెళియే తల్లై కాట్ట మాట్టాళ్ శౌంతక్కారి'

(పనిమనిషి సమర్థురాలు, వెలుపలికి తల చూపదు యజమానురాలు)

'ఒరు కిణట్రిల్ ఒరు తవళై' (ఒక బావిలో ఒక కప్ప) మొదలైన తమిళ ప్రహేళికల్లో నాలుకకి అనేక రకాల పోలికలున్నాయి.

**6. ముక్కు**

'ఒక యింటికి రెండు దారులు'

'రెండు నూతులకు మధ్య ఒక వంతెన'

'రెండు మిద్దెలకు ఒకటే దూలం'గా నాసిక భాసిల్లింది.

తమిళభాషలో:

'ఇరండు కిణఱుక్కు ఒరు పాలం' (రెండు బావులకి ఒక వంతెన)

'ఇరండు వీట్టుక్కు ఒరే విట్టం' (రెండు యిళ్ళకు ఒకే దూలం) అన్నారు. పై రెండు భాషల్లో పొడుపు కథలు ఛాయ ప్రతి ఛాయల్లాంటివి.

**7 దంతాలు**

'చిన్న ఇంటి నిండా చెక్కలు'

'చిన్న యింట్ల నీరు సెక్కలు'

'చిన్న గదిలో చిలుకల బేరు'

'రైతు చల్లని విత్తనం, మేస్త్రీ కట్టని కట్టడం.

చాకి ఉతకని బట్టలు, ఉలితో చెక్కని రాళ్ళు : ఇవీ పళ్ళు.

'ఇరుట్టు అఱైయిల్ ముత్తు వరిశై' (చీకటి అరలో ముత్యాల వరస)

'ఒరు కట్టుత్తుఱైయిల ముప్పత్తిరండు పశుక్కళ్' (ఓ కొట్టంలో 32 పశువులు)

'కినట్రై శుట్రి వెళ్ళిక్కల్' (బావి చుట్టూ వెండిరాళ్ళు) అంటూ తమిళంలో పొడుపు కథలు.

**8. చేతివేళ్ళు**

'పొకాల మేడకు పది కూసాలు, ఊపితే ఊగుతై పీకితే రావు' అనేది తెలుగు ప్రహేళిక. అచ్చుపు పోలిక తమిళంలో–

'ఆట్రిలే పత్తుమరం, అశైయుదు పిడుంగ ముడియవిల్లై'

(నదిలో పది చెట్లు, కదులుతాయి పీకలేము).

**9. తక్కెడ**

'సంతలన్నీ తిరుగుతాడు, సమానంగా పంచుతాడు' అంటూ వ్రాసుకున్న నిష్పాక్షిక దృక్పథాన్ని తెలుగులో పొడుపు కథగా చెబితే, తమిళంలో–'ఉయర్ ఇల్లాద నీదిపది, ఒళుంగామ నియామం శొల్లుగిఱార్' అన్నారు. 'ప్రాణం లేని నీతిపతి, చక్కగా న్యాయం చెబుతాడు' అని అర్థం. తక్కెడ జీవం లేని న్యాయాధీశుడు. అయినా ధర్మకార్య నిర్వహణంలో పక్షపాత వైఖరి పాటించదు. తెలుగు, తమిళ పొడుపు కథల భావం ఒక్కటే! అభివ్యక్తుల్లో కొంత తేడా!

**10. గంటె**

పిడికెడు పిట్టకు మూరెడు తోక' లా కన్పించింది ఆంధ్రులకి. తమిళులు 'కుత్తు కురువిక్కు ముళం వాల్' (పిడికెడు పిట్టకి మూరెడు తోక) అన్నారు. ఇందులో ఒకటి బింబం. మరోటి ప్రతిబింబం.

**11. చీపురు**

'నేలను నాకింది, మూలను కూర్చుంది' చీపురుతో చిమ్మడం నేలని నాకడంగా వర్ణించారు. తమిళంలో 'ముట్రత్తిల్ నడక్కుం, మూలైయిల్ పడుక్కుం' (గదిలో నడుస్తుంది, మూలకి పడుకుంటుంది) అని చెప్పారు.

**12. అద్దం**

'అందరికి ముఖం చూపుతాను, కాని వీపు గోకు వాళ్ళతో విరోధం'. ఇది తెలుగు పొడుపు కథ.

'ముగత్తై కాట్టువాన్ ముదుగై కాట్టమాట్టాన్' అని తమిళం. (ముఖాన్ని చూపుతాడు వీపుని చూపడు). అద్దానికి అభిముఖంగా ఉంటేనే అది ముఖం చూపిస్తుంది. వీపు అద్దంలో కన్పించదు. ఆ విషయమే ఉభయ భాషల్లో ఏకరీతిగా ప్రస్తావితమైంది.



**13. గొడుగు**

ఇది 'ఇంట్లో మొగ్గ, బయట పువ్వు' లా కన్పించింది తెలుగు పల్లీయుల కళ్ళకి. పని లేనప్పుడు ముడిచిపెట్టబడిన గొడుగు మొగ్గలా కన్పిస్తే, ఎండావానల్లో విప్పబడ్డ ఛత్రం వికసిత పుష్పంగా గోచరించడం అద్భుత విషయం.

తమిళులేమో 'ఉయరంద కొంబత్తిలే మలరేంద పూ ఎద?' (ఎత్తైన కొమ్మపై పూచిన పువ్వు ఏది?) అన్నారు. ఇక్కడ ఛత్రపు బెత్తం చెట్టు కొమ్మపైన విచ్చుకున్న వస్త్రం సాక్షాత్తూ పుష్పం. ఆలోచనల్లో తమిళులకీ, ఆంధ్రులకీ ఎంత దగ్గరి పోలికలున్నాయనేది పై పొడుపు కథలు విడమరిచి చెబుతున్నాయి.

**14. కొబ్బరికాయ**

తెలుగు, తమిళాల్లో కొబ్బరికాయకి సంబంధించిన పొడుపు కథలు ఎక్కువగానే ఉన్నాయి. మచ్చుకి కొన్ని :

'బండను కొట్టి వెండి తీస్తారు' – తెలుగు.

'అడిత్తాల్ అళువాన్, పిట్టాల్ శిరిప్పాన్' – తమిళం.

(కొడితే ఏడుస్తాడు, విప్పదీస్తే నవ్వుతాడు).

ఎంత రమ్యమైన భావన! టెంకాయని కొడితే ముందు లోపలి నీళ్ళు బయటికి కారుతాయి. ఇది శోకం. పూర్తిగా విప్పదీశాక తెల్లగా భళ్ళున నవ్వుతాడు. ఎంత అద్భుతమైన సహజ సుందరమైన, సత్యసన్నిహితమైన కల్పన యిది! తమిళంలోనే మళ్లీ–

'శుట్రిలుం కల్‌కట్టు, నడువిల్ వెళ్ళికట్టు'

చుట్టూ రాతికట్టు, నడుమ వెండికట్టు' అని చెప్పారు.

**15. ఆముదపు కాయ**

'ముత్తెమంత్రల ముగ్గురు దొంగల్లా' కన్పించాయి ఆముదపు కాయలోని విత్తనాలు.

'ఒకే ఇంట్లో ముగ్గురు యారాండ్రు

ఒకరి మొగం ఒకరికి కనిపించదు' అనే పొడుపు కథలో ఆముదపు గింజల్ని తోటికోడండ్రుగా పోల్చడం సముచితం. ఏరాండ్రు సమష్టి కుటుంబంలో ఉన్నా ఒకరంటే మరొకరికి గిట్టదు. ఆముదపు కాయలోని గింజల అమరికా అలాంటిదే!

తమిళంలో 'ఒరు శిమిళియిల్ మూన్ఱు పెణ్‌గళ్' (ఒక పెట్టెలో (మూడు) ముగ్గురు

స్త్రీలు) అన్నారు. 'పెట్టెలో స్త్రీలు' అనడం కన్న 'ఇంటిలో యారాండ్రు'గా భావించడం భావ్యమైన ఊహ. గింజల అమరిక తెలుగు పొడుపు కథా భావానికి అతి దగ్గర.

ఇలా రెండు భాషల్లోనూ పల్లీయుల అనుభూతులు ఒక్కరీతిగా ఉండటం ఆశ్చర్యం కల్గించే విషయం. 'దర్శనంబువేరు దైవంబది ఒక్కటి', 'భాషలెల్ల వేరు పరతత్వమొక్కటి' అన్నట్టు అక్షరాలు వేరయినా అనుభవాలు ఒక్కటి. మనుషులు ఎక్కడి వారయినా మౌలిక తత్వం ఒక్కటే.

## ఉపయుక్త గ్రంథాలు


1. పొడుపు కథలు-డా॥ వెలగా వెంకటప్పయ్య (సంపాదకుడు).
2. తెలుగు పొడుపు కథలు-ఆచార్య కర్ణరాజ శేషగిరిరావు.
3. పొడుపు కథలు-ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మచే సంకలితం.
4. గోడమీద బొమ్మ-డా॥ వెలగా వెంకటప్పయ్యచే సంకలితం.
5. పొడుపు కథలు-పరిశీలన-డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
6. పొడుపు పద్యాలు-డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి.
7. 1000 విడుకదైగళ్-ముల్లై ముత్తయ్య.


*- తెలుగు జూన్, 1991*



# నీడలా వెంటాడే అసంతృప్తి సృజనకు ప్రేరణ

ఆట్టూర్ రవివర్మది ఓ ప్రత్యేకమైన అనుభవ ప్రపంచం. అతను మలయాళంలో కవిత్వం రాస్తాడు. ఆ కవిత్వం ఇతరులకన్న భిన్నంగా రాస్తాడు. రాసిన కవిత్వాన్ని చాలా సంవత్సరాల వరకు పత్రికలగ్గానీ, సంచికలగ్గానీ పంపకుండానే 1977లో నేరుగా "కవిత" అన్న పేరుతో ఓ పుస్తకం వేసాడు. అది అప్పట్లో చాలా మందిని ఆకర్షించింది. మళ్ళీ ఇటీవల "రవివర్మ కవితలు" పేరుతో తను 1957 నుండి 1994 వరకు రాసుకున్న కవిత్వాన్ని సంకలనంగా తెచ్చాడు. ఈ ప్రస్తావనంతా ఎందుకంటే ఆ సంకలనానికి యిప్పుడు కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు వచ్చిందని చెప్పాడానికే!

మూస పద్ధతులకు రవివర్మ మొదట్నించీ వ్యతిరేకం. వచన కవిత్వంలో ఎప్పుడూ ఒకే రకమైన కవితా నిర్మాణ పద్ధతులన్నా, వాక్యరచనా విన్యాసాలన్నా, పులమడం రుద్దడం లాంటి పునరుక్తి దోషాలన్నా అతనికసలు నచ్చవు. 1977లో వచ్చిన 'కవిత' సంకలనంతో ప్రారంభమైన అతని ప్రస్థానం యిప్పటిదాకా అప్రతిహతంగా ముందుకి సాగుతోంది. సాహిత్య అకాడమీ బహుమతికి అర్హమైన రవివర్మ కవితల్లో మొత్తం కవితల సంఖ్య యాభై మాత్రమే! కొంగ్రొత్త శిల్పరీతులతో రాసే కవి రాసి కన్నా వాసి ప్రధానం అనుకుంటాడు. గత నాలుగు దశాబ్దాల మలయాళ కవితల్లోని అనుభవసార మంతా రవి వర్మ రాసిన "ఒక మహానది తన మౌనంలాగా" అన్న కవితలో కనిపిస్తుంది.

యాభయిల్లో మలయాళ-కవిత్వంలోకి జొరబడిన కాల్పనికతను కాదని తనదైన ప్రత్యేక ముద్రతో ముందుకొచ్చిన కవి రవివర్మ. తను కవిత్వం రాసే తొలినాళ్ళనుంచీ సొంత గొంతుతోనే కలం నడిపే వాడు. సంప్రదాయాన్ని బొత్తిగా నిరాకరించిన కవి రవివర్మ. అభ్యుదయ సాహిత్యం పట్ల విపరీతమైన ఆసక్తి.

సామ్యవాద ఆదర్శాలు ఆనాటి ఎందరెందరో నవయువ కవుల్ని ఆకర్షించినట్లుగానే రవివర్మనీ ఆకట్టుకున్నాయి. కవిత్వం విషయంలో వస్తుపరంగానే కాక రూపపరంగా కూడా రవివర్మకు మొదట్నించీ కొన్ని నిశ్చితాభిప్రాయాలుండటం విశేషం. ఈ విలక్షణ స్వభావం అతడు విద్యార్థి దశలో రాసుకున్న కవిత్వంలోనూ కనిపిస్తుంది. రవివర్మ మాటల్లోనే చెప్పాలంటే..."సంప్రదాయ కవిత్వానికీ నాకూ ససేమిరా పొసగదు. సోషలిస్టు రచనా పద్ధతులంటేనే నాకు ఆసక్తి. అదే సమయంలో జానపద నిర్మాణ రీతులతోనూ, జానపదుల భాషతోనూ పూర్తిగా మమేకమవుతాను. కాల్పనికత గిట్టదు గాక గిట్టదు" అని చెప్పుకోవాలి. రవివర్మకు సామ్యవాద ఆదర్శాలు పెద్ద ఆకర్షణగా నిలిచినప్పటికీ అతను వాటికి పూర్తిగా అతుక్కుపోలేదు. వాటిని మొత్తంగా హత్తుకోలేదు.

"ఎప్పుడూ ఏదో ఒక అసంతృప్తి నీడలా వెంటాడుతూ వుంటుంది. యథాతథంగానూ, మామూలుగా వున్న దేనితోనూ ఏకీభవించని అవస్థ. ఈ విలక్షణమైన బాధ నుండి విముక్తం కావడానికే నేను కవిత్వాన్ని ఆశ్రయిస్తున్నాను" అని చెప్పుకుంటాడు రవివర్మ.

చదువైపోయాక రవివర్మ మద్రాసు మహానగరానికి వెళ్లాడు. అది అతని జీవితంలో గొప్ప మలుపుని తీసుకువచ్చింది. దృష్టి విశాలమైంది. ఓ కొత్త అనుభవ లోకాన్ని ఆ నగరం చూపించనారంభించింది. అక్కడి పెద్ద పెద్ద గ్రంథాలయాలు, కొత్త కొత్త సినిమాలు, కళా సాహిత్య రంగాలకు చెందిన కొంగ్రొత్త ఆలోచనారీతులు, కె.పి.ఎస్. పణిక్కర్, ఎం. గోవిందన్ లాంటి వ్యక్తుల స్నేహాలు...అన్నీ రవివర్మను మరింత తీర్చిదిద్దాయి. ఇవన్నీ ముందు అతణ్ణి మనిషిని చేశాయి. మానవుడిగా నిలబెట్టాయి. అతని సోషలిస్టు ఆదర్శాలకు మానవతా స్పృహ వచ్చేసింది. ముఖ్యంగా ఎం. గోవిందన్ సాహచర్యం అతనిలో అనేక రసాయనిక చర్యలకు కారణభూతమయ్యింది. గోవిందన్ హ్యూమనిస్టు. అతని ఆలోచనలు రవివర్మకు కొత్తగా దిశానిర్దేశం చేశాయి.

"మనిషి ఎంత గొప్పవాడో చెప్పగల్గిన మానవతా సిద్ధాంతం నేను గోవిందన్ గారి నుంచి నేర్చుకున్నాన"ంటూ మాంఛి మూడ్‌లో అతని మీద రెండు గొప్ప కవితలు రాశాడు రవివర్మ.కవిత్వంలో అప్పటికే మనిషికి పెద్దపేట వేసిన రవివర్మ మానవ ప్రాధాన్యాన్ని మరింతగా పెంచి రాశాడు. ఈ కాలంలోనే "మాతృభూమి"కి "ముగ్గురు కన్యలు" పేర మంచి కవిత్వం రాశాడు.



"నా ఆసక్తుల్నీ, ఆలోచనల్నీ, ఆదర్శాల్నీ పునర్ మూల్యాంకనం చేసుకోవాల్సి వుంది. అందుకే నా రచనా రీతుల్ని మరింతగా మారుస్తున్నాను" అని చెప్పుకొచ్చాడు రవివర్మ తదనంతర కాలంలో ఈ సమయంలోనే "నగరంలో యక్షుడు" అంటూ కవిత అల్లాడు. పాత పద్ధతులకు పాతర వేశాడు.

సంప్రదాయ విధానాలకూ, పాతరీతులకూ దూరంగానూ, వేరుగానూ నిల్చి ప్రగతిశీల దృక్పథంతో ముందుకి వెళుతున్న రవివర్మ ఆ తర్వాత "అతను నేనే కాదూ", "ఆర్యం", "పితృగమనం" లాంటి కవితల్లో మనిషి సమూహంలో వుండి కూడా ఒంటరివాడెలా అవుతున్నాడో వివరించాడు. 1965లో "పిచ్చి" అన్న కవిత రాసినా అదిప్పటికీ నిత్యనూతనమే! "సంక్రమణం" కవిత ఈనాటి స్త్రీవాద దృష్టితో చూస్తే ఉత్తమ కవితగా నిలుస్తుంది. దీన్నతడు 1974లోనే రాశాడు.

చాలామంది సాహిత్యకారుల్లాగా మార్కెట్ చేసుకోవడానికో, సంచలనం కల్గించడానికో రవివర్మ పాశ్చాత్య భావజాలాన్ని స్వీకరించలేదు. అది అరువు తెచ్చుకున్న ఆలోచనా విధానంలాగా, వుత్త పైపై లేపనంలాగా లేకపోవడమే విశేషం. కారణం...అతని మూలాలు గ్రామాల్లో వున్నాయి. వేళ్ళు వూళ్లల్లో పాదుకున్నాయి. ఇతని కొత్తదనం అంతా దేశీయమైంది. కేరళలో 1940-50 ల మధ్య వామపక్ష భావజాలంతో స్ఫూర్తి పొంది పుంఖానుపుంఖంగా విప్లవ కవిత్వం రాసిన చాలామంది తదనంతర కాలాల్లో నవ్య సంప్రదాయవాదులుగా మారిపోవడం అక్కడ పెద్ద విషాదం. రవివర్మ దేశీయత అలాంటిది కాదు. గ్రామాల్లోకి వెళ్ళగల్గిన దేశీయత అది. ఎంత నిష్కర్షగా తన అభిప్రాయాల్ని వెల్లడిస్తాడో చూద్దాం. "మంచి సంప్రదాయం కన్న చెడ్డ ప్రయోగమే మిన్న. ఉత్తమమైన పాత కన్నా వుత్త చెత్తయినా కొత్తే హాయి". పైగా పద్య కవిత్వం వైపు కన్నెత్తి చూడలేదు. గేయ కవితల దిక్కు కలమెత్తి రాయలేదు. "పద్యంలోగానీ, గేయంలోగానీ భాషా, లయలూ ప్రధానం. వచన కవిత్వంలో వచనమూ, అనుభూతి ప్రధాన పాత్ర వహిస్తాయి. అందుకే నేను ఫ్రీవర్స్ రాస్తాను" అంటాడు రవివర్మ.

ఆట్టూర్ రవివర్మ మంచి అనువాదకుడు కూడా. జే.జే. గారి కొన్ని నోట్స్, ఓ చింతచెట్టు కథ, ఆధునిక తమిళ కవితలు మొదలైన అనువాద గ్రంథాలు ప్రచురించాడు.

గత యాభయేళ్ళ కేరళీయుల జీవితానుభవాన్ని యింత సూక్ష్మంగా ఏ మలయాళ కవి పట్టుకోలేదని చెప్పవచ్చు. ఎలాంటి పదాడంబరాలూ, పటాటోపాలూ లేని కవిత రవివర్మది. కె.జి. శంకరపిళ్ళ మాటల్లో రవివర్మ కవిత "వుక్కుపాళీల్ని విరవగల్గిన ఆక్సీ ఎసిటలీన్ జ్వాల. అది ఆధిపత్య సంస్కృతిని నిలువరించిన కవిత. ఊళ్ళల్లోకి, వేళ్ళల్లోకి వెళ్లగల్గిన కవిత్వం అనుభవ సారమంతా అక్షరాల్లో వడగట్టిన కవిత్వం".

-వార్త (ఆదివారం) 27-01-2002



# నూరేళ్ళ నీరద్ దారిలో చీకట్లూ, వెలుగులు

నాకు పందేళ్ళు వచ్చిన సందర్భంగా మీరడిగారు కనుక రాసి పంపిస్తున్నాను. కానీ ఏం రాయాలో తోచట్లేదు. నా మదిలో ఏయే భావాలున్నాయి? ఏమో..కచ్చితంగా చెప్పలేను. అయితే 1947 నాటి మే 5-6 తేదీల్లో నేను ఏ భావావేశానికి గురై స్వీయచరిత్ర (ది ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఏన్ అన్‌నోన్ ఇండియన్) రాయడానికి ఉపక్రమించానో...దాని గురించి చెబుతాను.

అప్పట్లో నా ఆరోగ్యం బావుండేది కాదు. మరో రెండు మూడు సంవత్సరాలకన్నా ఎక్కువ కాలం బతకనేమో అనిపించింది. అత్యంత దుఃఖితుడ్నైపోయి జీవితంలో నిలిచిపోదగిన ఏ ఒక్క రచనా చేయలేకపోయానని మథనపడ్డాను. ఆ దుఃఖాతిశయంలో రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు. సరిగ్గా అల్లాంటి సమయంలోనే మే 5 నాటి రాత్రి సగం మెలకువా సగం నిద్రా కలగలసిన ఒకానొక స్థితిలో ఏవో మాటలు విన్పించాయి. అవి నా లోంచే వస్తున్నట్లు అనుభూతికి లోనయ్యాను. 'అనేకానేక పరిశోధనలు చేసి చరిత్ర రాయాలనుకున్నావు. అదీ రాయలేకపోయావు. ఫరవాలేదు. నీ జీవితంలో ఏ చరిత్రకి సాక్షీభూతంగా నిలిచావో దాని గురించి రాస్తే పోలా' ఇంకేం? ఆ మాటల ప్రభావంతో మర్నాటి ఉదయం నించి రాయడం మొదలుపెట్టాను. ప్రతిరోజూ ఉదయాన లేవడం, ఆఫీసుకి వెళ్ళడానికి ముందు రెండు మూడు గంటలు కూచుని టైపు చేయడం, ఆఫీసు నించి తిరిగి రావడం, మళ్ళీ రాయడం, ఇలా. లోగడ అంటే ...1931 వరకు కథలు రాసిన అనుభవం ఉంది. (అది విద్యార్థి దశ పూర్తయిన కాలం) ఇన్ని రాసినప్పటికీ నన్ను ఓ సంశయం ఇప్పటికీ పట్టి పీడిస్తోంది. అదేమంటే... ఈ రచనలన్నీ

నిజానికి నావేనా? ఈ విషయంలో నాకో స్పష్టమైన అభిప్రాయ ఉంది. అనేక సంవత్సరాలుగా నేనా అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూనే వచ్చాను. అం యినప్పటికీ మళ్ళీ ఓ మారు చెబుతున్నాను.

1967లో ఇంగ్లండులో నాకు ఓ సాహితీ పురస్కారం ప్రదానం చేశారు. నాకన్న ముందు ఆ బహుమతి ఏ ఒక్క భారతీయుడికీ రాలా. అప్పటివ కూ ఆ అవార్డు లబ్ధప్రతిష్టులైన ఆంగ్ల రచయితలకే లభించింది. నేను సైతం ప్రసిద్ధ ర యితల పంచన చేరిపోయాను. డబ్బుల రూపేణా ఆ పురస్కారం విలువ పెద్ద మొత్త కాకున్నప్పటికీ ఫ్రాన్సులోని 'ప్రిక్స్‌కాంకోర్ట్' లాగా బాగా గౌరవాదరాలు కల్గిన అవా . ఫీల్డు మార్షల్ సర్‌క్లాడ్ అచిన్‌లెక్‌గారు తన చేతుల మీదుగా నాకు బహుమతి ప్రద నం చేశారు. ఆ బహుమతి నేను రాసిన 'ది కాంటినెంట్ ఆఫ్ సర్కిల్'కి వచ్చింది. సర్ క్లాడ్ గారి స్వాగతోపన్యాసం పూర్తయ్యాక నేనిలా అందుకున్నాను.

'లిటరసీ ప్రైజెస్ ఆల్వేస్ గో టుది రాంగ్ పార్టీస్. దీస్ ఆర్ ఎర్న్ బై బుక్స్, బట్ ఆర్ మిస్ అప్ప్రొఇయేటెడ్ బై ది అదర్స్' నేను ఎల్లవేళలా ఇ ే అభిప్రాయం ప్రకటించేవాణ్ణి. నా రచనలన్నింటిలోనూ 'నేను వినాయకుడిలా లే కుణ్ణి మాత్రమే' అని చెప్పుకునేవాణ్ణి. పై మాటలు విని ఆ సభాసదులైన పండితులం తా నవ్వేసారు.

ఇహ...ఆ విషయం పోనివ్వండి...నేను నూరేళ్ళు బతికినం దుకు సార్థకత లభించిందా? ముందు 'సార్థకత' పదానికి అర్థం కనుక్కోలేకపోతే...ప్ర ప్రశ్నకి జవాబు దొరకడం కష్టం.

అయితే...నా ఉద్దేశం ప్రకారం జీవించడానికి 'నిష్కామకర్మలు' ాలా అవసరం. నేను అనేక తత్వశాస్త్రాలు అధ్యయనం చేశాను. వాటన్నింటిలోకెల్లా నా బాగా నచ్చింది 'స్టోయిక్' తత్వమే. దీనికి కారణాలు రెండు. 1. ఈ తత్వం మృత్యువు కూడా చక్కని అవగాహన కల్గి ఉంది. 2. ఇది చారిత్రక అనాసక్తిని తొలగించి పరిమితాసక్తిని కల్గిస్తుంది. కారణాలు చెప్పలేను కానీ...ఎందుకో నేను అతి పిన్న వయస్సు నించే మృత్యువు గురించి ఆలోచించేవాణ్ణి. అది 1913 నాటి మాట. నేనప్పుడ పదో తరగతిలో ఉన్నాను. మరుసటేడు మెట్రిక్యులేషన్ రాస్తాను. ఆమ్సహాస్టు వీధిలో ఉ టున్నాను. నిద్రకి ఉపక్రమించే ప్రతిసారీ..'ఇంకేం నిద్రలోకి జారిపోతాను. తెల్లారేసరికి చచ్చిపోతాను' ఇలా సాగేవి నా ఆలోచనలు. అనుకున్నట్లుగా కాకుండా తెల్లవారేక ిచి తెరచి వున్న కిటికీ లోంచి వెలుతుర్ని చూస్తే ఎంతో సంతోషం కలిగేది. ఏమైనా మృత్యువు మీద నా ఇష్టాయిష్టాల ప్రభావం పడలేదని నాకు తర్వాతర్వాత బాగా తెలిసొచ్చింది.



మృత్యుదేవతకి నేను ఆత్మసమర్పణం చేసినందువల్లే మృత్యుంజయుణ్ణి అయ్యాను. రవీంద్రనాథుడూ ఈ విషయంలో నాతో కొంతమేరకి ఏకీభవించాడు. కానీ అతనన్నట్లు...మరణం తర్వాత మళ్ళీ ప్రాణం పోసుకుంటాము అనే విషయం పట్ల నాకు విశ్వాసం లేదు. నేను మృత్యువు గురించి నా 'ది త్రీ హార్స్‌మెన్ ఆఫ్ ది న్యూ అపోకాలిప్సీ' అనే గ్రంథంలో వివరించాను. అసలు మృత్యువుకి సరైన వివరణ మనిషికి ఏనాటికీ సాధ్యం కాకపోవచ్చు.

ఇక....వందేళ్ళు నిండిన సందర్భంగా మానవ జీవనం గురించి నేను ఏర్పరచుకున్న అభిప్రాయాలు వివరిస్తాను. 1863లో టి.హెచ్. హక్స్లే ఓ గ్రంథం రాసేడు. దాని పేరు 'మాన్స్ ప్లేస్ ఇన్ నేచర్'. నేనూ అతని అభిప్రాయాలతో ఏకీభవిస్తాను. విభేదించే అంశాలూ లేకపోలేదు. హక్స్లే భావాలకూ, నాకూ అనేక సాదృశ్యాలున్నాయి. ప్రపంచంలోని మతాల విషయంలో అతనికీ, నాకూ ఒక రకమైన అభిప్రాయాలున్నాయి. మతం...అది ఏ మతం అయినప్పటికీ మనిషికి ఈ ప్రపంచంతో వున్న సంబంధం తాత్కాలికం అంటున్నది. మనిషి స్థానం జనన మరణాలకు ఆవలివైపూ, ఈవలి వైపూ వున్న ఒకానొక అనంతలోకం అంటున్నది. అదే పరలోకం. వర్డ్స్‌వర్త్ అవర్ బర్త్ ఈజ్ బట్ ఎ స్లీప్' అన్నట్లుగా రవీంద్రుడికీ అలాంటి నమ్మకాలు ఉన్నాయి. ఇంకా ఈ రవీంద్రుడు మృత్యువు అనంత జీవన సింహద్వారం అన్నాడు. మతాలన్నీ అనాదిగా ఈ మోస్తరు అభిప్రాయాల్నే చలామణిలో ఉంచాయి. నాకైతే ఇలాంటి నమ్మకాలు ఏవీ లేవు. మనిషికీ ఈ ప్రపంచానికీ మంచి సంబంధం ఉంది.

చావు పుట్టుకల తాళ్ళతో ఈ ప్రపంచానికి నిబద్ధత మానవుడికి మొదట్నించీ వుంది. ఈ నా వివరణ...నేను జ్ఞానేంద్రియాల ద్వారా ఆర్జించిన విషయాల మీద ఆధారపడి ఉంది. నా వివరణకి కుదురు మిథ్య కాదు.

అసలు నేను మానవుణ్ణి ఒక విడి అంశంగా పరిగణించను. అతడు నానా పదార్థాల సమ్మిశ్రణం ద్వారా ఏర్పడిన ఒకానొక కాంపౌండ్ ఎలాగంటే..

1. మొదట....మనిషి ఓ జడ పదార్థం, భౌతిక, రసాయనిక నియమబద్ధుడు, ఈ నియమోల్లంఘనం అతనివల్ల కాదు.
2. మనిషి ఒక జీవి. కనుక జీవశాస్త్ర సూత్రాలకూ నిబద్ధుడు. వీటిని గమనించని మనిషినే మూర్ఖుడని పిలుస్తాం. క్రైస్తవమతం స్త్రీ పురుషుల సంగమాన్ని మహాపాపంగా అభివర్ణించి మనిషిని అసహజమైన వ్యక్తిగా మార్చింది.
3. మనిషి మనోసంపద కలవాడు. మనిషి మనస్సులో కామక్రోధ లోభ మదాదులకి

స్థానముంది. కానీ వీటికి వశుడై హద్దులు మీరితే ప్రమాదపుటంచులకి చేరిపోతాడు. 'సెల్ఫ్ కంట్రోల్' చాలా అవసరం. నాకా ఆత్మసంయమన శీలం కొంత కొరవడొచ్చు. నాలో సోమరితనం ఎక్కువమో! దీనిక్కారణం..జన్మతః వచ్చిన బలహీన శరీరం.

జీవితంలో మనం ఆనందాన్ని అనుభవించాలంటే ముందు మన బలమూ, బలహీనతల గురించి మనకి స్పష్టమైన అవగాహన ఏర్పడాలి. నా దృష్టిలో గొప్పమాట 'ఆత్మానమ్‌విద్ది'.

డబ్బులూ, పేరు ప్రఖ్యాతుల ప్రలోభానికి గురై కానివ్వండి, లేదూ...లోకనిందకి వెరచి కానివ్వండి...బెంగాలీలు తమవైన అసలు సామర్థ్యాలనీ, అసామర్థ్యాలనీ విస్మరించారు. నేను మాత్రం ఈ విషయంలో చాలా జాగరూకతతో ప్రవర్తించాను. నేను నా చిన్నతనం నించీ తెల్సుకోగలిగింది ఏమంటే...నాకు రాసే సామర్థ్యం తప్ప మరే సామర్థ్యాలూ లేవని.

జీవితాన్ని సార్థకం చేసుకోవడానికి మరో అద్భుతమైన ఉపాయం ఏమంటే...లోకుల మాటల్నీ, లోకుల నిందల్ని ఏ మాత్రం పట్టించుకోక పోవడం. జీవన సార్థక్యానికి మరొక మార్గం విద్వేషం విడవడం. ఇటీవల హిందువులు ఈ విషయంలో పప్పులోనూ, తప్పులోనూ కాలేశారు. ఈ విద్వేష స్థానంలో ప్రేమాభిమానాలు రావాలి. వాటి గురించి మనం ఎదురుచూడ్డం కాదు ఎదుటివాళ్లకి మనమే పంచివ్వాలి. అలా పంచడం కూడా నిష్కామంగా జరగాలి. పైగా జీవితాన్ని సార్థకం చేసుకొనేందుకూ, సుదీర్ఘకాలం జీవించేందుకూ మరో ఉపాయం ఉంది. అదేమిటంటే...కర్తవ్య పాలన, కుటుంబ బాధ్యతలు కానివ్వండి...సామాజిక బాధ్యతలు అవనీయండి. ఆ బాధ్యతల్ని గుర్తెరగకుండా, వాటిని నిర్వర్తించకుండా ఎవ్వరూ సుఖ సంతోషాలని పొందలేరు. బతుకుని సార్థకం చేసుకోవడానికి మరో మహత్తర కార్యం, సృజన (రచనలు) చేయడం, ఒకవేళ మీకు రాయగల్గిన శక్తి లేనట్లయితే మహా మహుల రచనలు భావితరాల కోసం భద్రపరచండి. సంఘంలో అవాంఛనీయ రచనలుంటే వాటిని నశింపజేయండి. ఒక్కమాటలో చెప్పాలంటే...సృష్టి (రచించడం), స్థితి (కాపాడడం), లయలు (పాడు రచనల వినాశనం) సమయానుకూలంగా, శక్త్యానుసారంగా పాటించాలి.

నా నూరేళ్ళ జీవిత జ్ఞానానికి ఫలశ్రుతి ప్రస్తుత వ్యాసం. ఇక సెలవు.

(1-11-1997 దేశ్.. బెంగాలీ పత్రిక ఆధారంగా)



# సుద్దులొలికే పత్రికల ముంగిటి ముత్యం - స్వామినాథ సదానందం

టెలిఫోన్ మోగుతూనే ఉంది. నా పై అధికారి ఫ్రీ ప్రెస్ గ్రూపు వార్తాపత్రికల యజమాని స్వామినాథ సదానంద్ ఫోన్ చేస్తున్నారని నాకు తెలుసు. కాని వారితో మాట్లాడ్డం నాకవసరం లేదు. ఆ రోజు పొద్దుటే ఏదో చిన్న విషయానికి వారు నాతో కటువుగా మాట్లాడారు. లోగడ ఎన్నోసార్లు వారు నాతో అలా ప్రవర్తించినప్పటికీ ఈసారి నా మనస్సు వికలమైంది. అన్యమనస్కంగా వారి గదిలోంచి బయటపడి రాజీనామా పత్రం రాసి మళ్ళీ ఈ కార్యాలయానికీ వెళ్ళేది లేదని నిర్ణయించుకున్నాను.

"వెళ్ళు మాట్లాడు" అంది మా వదిన. రిసీవర్ తీసుకున్నాను. నేను ఊహించి నట్లుగానే అది సదానంద్ గారిది. సాధారణంగా కర్కశంగా వుండే వారి గొంతు, కన్నీళ్ళతో కూడి గాద్గదికంగా వుంది. 'నేనెందుకు అంతగా క్షోభకి గురయ్యాను? నేను వారికి రెండో కొడుకులాంటి వాణ్ణి! తండ్రి కొడుకుల్ని మందలించ కూడదా?' నేను మళ్ళీ కార్యాలయానికి వెళ్ళక తప్పదని అనుకున్నాను. సదానంద్ నన్ను పిల్చుకురావడానికి తన కొడుకుని పంపిస్తున్నారట!

ఆఫీస్‌కి వెళ్ళాను. మై మరపించే ఆ గాఢాలింగనం పొద్దుటి సంఘటనలాగే దిగ్భ్రమ కలిగించింది. కాకపోతే అది మనస్సు వికలం చేసిన సంఘటన. ఇది నన్ను ముగ్ధుణ్ణి చేసిన సన్నివేశం. వారే సదానంద్‌గారు. పిల్లల అమాయకత్వం లాగా కోపిస్తూనే

ప్రేమించేవారు. నవ్వి ఏడ్చేవారు. పిల్లల నడవడి లాంటి ప్రవర్తనతో నాతోనూ, నాకు తెలిసిన వాళ్ళతోనూ తమ పని నిభాయించుకునేవారు.

ఇవాళ.....నలభైయైదు సంవత్సరాల క్రిందటి అనుభవాన్ని గుర్తు చేసుకుంటున్నప్పుడు సదానంద్‌గారు చాలా స్పష్టంగా నా కళ్ళముందు కనిపిస్తున్నారు. అతను ఓ సాహస పత్రికోద్యమకారుడు. శ్వేతజాతి దురహంకారానికి మాట తప్పని మడమ తిప్పని పత్రికా వీరుడు. మనదేశ వార్తలన్నింటినీ విదేశీ సంస్థలు ప్రసారం చేస్తున్నప్పుడు "ఇండియన్ న్యూస్ ఏజెన్సీ" ని స్థాపించిన స్వాప్నికుడు.

వారి అత్యంత శక్తివంతమైన వ్యక్తిత్వం, పనిలో తనను తాను మరచిపోయి మమేకం కావడం ... ఇవి వారిని మరచిపోలేని మనిషిగాను మనీషిగానూ తీర్చిదిద్దాయి. మాబోటి వాళ్ళకి "ఫ్రీప్రెస్" లో పనిచేయడం నల్లేరుమీద నడకలాంటిది కాదు. పల్లేరు మీది ప్రయాణమే! కాకపోతే కొన్నిసార్లు స్ఫూర్తిదాయకంగానూ వుండేది.

మరోరకంగా చెప్పాలంటే వైవిధ్యాలకి మారుపేరు సదానంద్. ఆనాటి చాలామంది భారతీయుల్లాగే వారు విద్యకి ప్రాధాన్యం ఇవ్వకుండా యువతకు ప్రాముఖ్యం యిచ్చారు. 1946లో పాతికేళ్ళున్న నేను పనికోసమై వారిని కలిసినప్పటికి సైన్సు గ్రాడ్యుయేటునై కొన్నాళ్ళు కెమిస్టుగా పనిచేశాను. "ఇది కార్ఖానా కాదు" అని మొరటుగా మాట్లాడుతూనే వెంటనే "నిన్ను పనిలోకి తీసుకుంటున్నాను. నెలకి నూరు రూపాయలు మూడు నెలలు అబ్జర్వు చేస్తాను" అన్నారు.

అబ్జర్వేషన్ వెంటనే ఆరంభమైంది. మున్సిపల్ కార్పోరేషన్ కాంగ్రెస్ రాజకీయం, జాతీయ నాయకుల ప్రసంగాలు..మొదలైన పనుల నిర్వహణా భారం నాకప్పగించారు. ఎంతో కష్టపడ్డాను. పరిశ్రమించడమే కాదు పరిక్రమించాను. జవహర్‌లాల్‌నెహ్రూ, అమెరికా అధ్యక్షులు హర్బర్జు హూవర్‌ని సందర్శించడంలో సఫలీకృతుణ్ని అయ్యాను. సదానంద్ నాతో ఏమీ ప్రస్తావించనప్పటికీ వారు సంతోషిస్తున్నారన్న విషయం కనిపెట్టాను. మనిషి ఔత్సాహికుడై కష్టపడడానికి సన్నద్ధుడైతే...ఏ పనిలోనైనా కృతకృత్యుడవుతాడన్న నమ్మకం నాలో స్థిరపడింది.

సదానంద్‌గారి ఆశ్రయంలో తీర్చిదిద్దబడిన "ఫ్రీప్రెస్" మన భారతదేశ పత్రికోద్యమ చరిత్రలో ముఖ్యమైన స్థానాన్ని సంపాదించుకుంది. పత్రికోద్యమంలో ప్రఖ్యాతులైన కార్టూనిస్టు ఆర్.కె. లక్ష్మణ్, టి.జె.ఎస్. జార్జు, ఏషియా వీక్ మాజీ సంపాదకులు



క్రీడా ప్రపంచ వ్యాఖ్యాత ఏ.ఎఫ్.ఎస్. తల్యార్ ఖాన్‌లు సదానంద్ గారి కోసం పనిచేసిన వాళ్ళు. అతని దగ్గర పనిచేసేవారిలో చాలామంది నాలాంటి మామూలు నేపథ్యాలనుంచి వచ్చినప్పటికీ...రాజాహథీసింగ్ (నెహ్రూగారి బావ), శారూఖ్ సాబవాలా, హోమితల్యార్ ఖాన్ (సిక్కిం గవర్నరై, తర్వాత లిబియా ఇటలీలకు భారత రాయబారి అయ్యారు) లాంటి సంపన్న యువకుల్ని వారు ఆకర్షించారు.

మా అందరి మీదా ఆధిపత్యం చలాయించిన ఆ మనిషి హైస్కూల్లోనే పాఠశాలకి సలాంకొట్టిన వారు. 1900 లో మద్రాసులో పుట్టిన సదానంద్ హైస్కూల్లో చదువుతున్నప్పుడే యిల్లు వదిలారు. తండ్రి తమిళ పత్రికని నడిపేవారు. సదానంద్ తనూ ఓ పాత్రికేయుడు కావాలని ఏనాడో నిశ్చయించుకున్నారు.

సదానంద్‌గారు ప్రారంభంలో పడ్డ కష్టాల గురించి మా కెక్కువగా తెలీదు. కొంతకాలం పాటు ముంబై అసోసియేటెడ్ ప్రెస్ అలహాబాదులోని ఇండిపెండెంట్, రంగూన్ టైమ్సు మొదలైనవాటికి పనిచేశారు. 1923లో ముంబైకి వెళ్లగానే కాంగ్రెస్ పార్టీ ప్రకటనలు, ఖాదీ గురించి ప్రచారం చేసే పనీ దొరికాయి.

వీటితో తృప్తి పొందని సదానంద్ ఫుల్‌టైమ్ పత్రికోద్యమకారుడై పనిచేయాలనుకున్నారు. అప్పుడు కేవలం "రాయిటర్స్" 'అసోసియేటెడ్ ప్రెస్' దేశంలోని పత్రికా ఏజెన్సీలు. అవి సహజంగానే స్వాతంత్ర్య సమరం పట్ల బ్రిటిష్ వాళ్ళ దృక్కోణంలోంచే వార్తలు రాసేవి. ఇది భరించలేక వారు "నేషనల్ న్యూస్ ఏజెన్సీ'ని స్థాపిస్తూ 'రాయిటర్స్' కు సవాల్ విసిరారు.

కాంగ్రెస్ పట్ల సానుభూతి వహించిన కొంతమంది పెద్దల ఆర్థిక సహాయంతో 1927లో సదానంద్ తన 'ఫ్రీ ప్రెస్ న్యూస్ ఏజెన్సీ'ని ప్రారంభించారు. మొదట్లో తన బాల్యమిత్రుడు శ్రీనివాసన్, సదానంద్‌గార్లు ఉభయులే వుండేవాళ్ళు. అతి తక్కువ ఖర్చుతో సంస్థ పని చేసుకుపోయేది.

పత్రిక కొంతమంది చందాదారుల్ని చేసుకోవడమే కాదు. కొత్త దారుల్ని వేసుకుంది. గాంధీగారు ఉప్పు సత్యాగ్రహం చేసినపుడు బ్రిటిష్ ప్రభుత్వం పత్రికోద్యమంపై కఠినమైన ఆంక్షల్ని విధించింది. 'ఫ్రీప్రెస్' ఏజెన్సీ ఫోన్సు, వార్తలు పూర్వ పరిశీలనకి గురవుతున్నాయి. రాజీనామా చేయాల్సిందిగా ఆ సంస్థ నిర్వాహకుల మీద ఒత్తిడి పెరగసాగింది. తత్ఫలితంగా పత్రికా చందాదారులు ఒక్కొక్కరే వెనుకడుగు వేయడం ప్రారంభించారు.

ఆ మాత్రానికే ఊరకే వుండిపోయేవారు కాదు సదానంద్. 'తమ ఏజెన్సీ వార్తల్ని ఇతరులు ప్రకటించలేనప్పుడు తనే ఓ పత్రికని ఎందుకు ప్రారంభించకూడదు? అని ఆలోచించి కొంత కాలంపాటు "ఫ్రీప్రెస్ న్యూస్ బులెటిన్" అనే పత్రికని వెలువరించారు. క్రమేణా పాతముద్రణా యంత్రాన్ని కొనగలిగారు. 1930 జూన్ 13 నాడు "ఫ్రీప్రెస్ జర్నల్" మొదటి సంచిక అచ్చై బయటికొచ్చింది. 1930-40 మధ్య "ఫ్రీప్రెస్" స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించిన వార్తల్ని ఫ్రీ హాండ్ యిస్తూ రాసేసింది. అవి తెల్ల దొరతనానికి సవాళ్ళు. స్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకంగా వార్తలు రాస్తోన్న పత్రికల్ని అత్యంత కటువుగా ఎదుర్కొన్నారు సదానంద్. తమ పాత్రికేయులు సేకరించిన వార్తల్ని పరిశీలించి రాసేవారు సదానంద్. అధికార మార్పిడి గురించి మంతనాలు చేయడానికని లార్డ్ పెథిక్-లారెన్సు గారి నేతృత్వంలో బ్రిటిష్ ప్రభుత్వ కమిటీ 1946లో ఢిల్లీకి వచ్చింది. సదానంద్ దాన్ని తీవ్రంగా విమర్శించారు.

ఏది ఏమైనప్పటికీ వారి చిరకాల వాంఛ అయిన స్వాతంత్ర్య పిపాస స్వాతంత్ర్యానంతరం వాస్తవమైన వార్తల్ని ముద్రించడంలో వ్యక్తమైంది. ఓసారి నన్ను 'కామత్! నువ్వు రాజకీయ వాదిగా మారడం చాలా సులభం. కానీ...మంచి పాత్రికేయుడు కావడం ఎంతో కష్టం" అని నాలో కొత్తగా ప్రవేశించిన రాజకీయ భావజాలాన్ని తుడిచి వేశారు.

స్వాతంత్ర్య పోరాట కాలంలో చరఖా మీద నూలు వడకడం లాగే సదానంద్‌గారి "ఫ్రీ ప్రెస్" పత్రిక చదవడం దేశభక్తి లక్షణంగా వుండేది. రాజద్రోహం నేరమ్మీద సదానంద్‌గారికి బ్రిటిష్ ప్రభుత్వం రెండుసార్లు కారాగార వాస శిక్ష విధించింది. 70,000 రూ.ల జరిమానా వేసింది. ఆ కాలంలో అది చాలా పెద్ద మొత్తం. అయినప్పటికీ యివేవీ సదానంద్ గారిని లొంగదీసుకోలేక పోయాయి.

సదానంద్‌గారి గురించి బాగా గుర్తు కొచ్చే ఒకే ఒక్క విషయం వారి దినచర్య. పొద్దుట పదిగంటల ప్రాంతంలో డ్రైవర్‌తో పాటు ఓ కారు దలాల్ స్ట్రీట్ నంబరు 21లో ఉన్న పత్రికా కార్యాలయానికి ఎదురుగా ఆగి వుండేది. స్వచ్ఛమైన తెల్లని ఖాదీ జుబ్బా, దోతి ధరించిన ఓ మనిషి కారులోంచి దిగేవారు. 'ఫిలేరియాసిస్' వ్యాధితో బాధపడు ఆ వ్యక్తి కాలు నొప్పితో బాగా ఉబ్బి ఉండేది. సాధారణంగా కచేరిలోని రెండో అంతస్తు దాకా వారు ఎక్కి వచ్చేవారు. కాని ఆరోగ్యం పాడయిపోయాక వారిని



ఓ కుర్చీలో కూచోబెట్టి ముగ్గురు మనుషులు ఎత్తుకుని తీసుకొచ్చేవారు. పని ప్రారంభించబోయే ముందు దేవుడికి నమస్కరించేవారు.

పొద్దుటి "ఫ్రీప్రెస్" పత్రిక చదివాక ఆదేశాలు యివ్వడం ఆరంభమయ్యేది. ఏదైనా ఒక వార్తతో తను సంతృప్తిపడితే ఆ విలేఖరి దగ్గరికి తనే వెళ్ళి అభినందించేవారు.

"ఫ్రీప్రెస్" పత్రికలో పనిచేయడం కత్తిమీద సాములాంటిది. ఏ విషయమైనా అతని యిష్టప్రకారం కాలేకపోతే, కోపిష్టియై తారతమ్యం లేకుండా పనిచేసేవాళ్ళని తీసివేసే వారు. కానీ, ఓసారి కోపం చల్లారిందంటే పనిలోంచి తీసి పారేసిన వాళ్ళని మళ్ళీ పిలిపించుకునేవారు. వార్తా సంపాదకుడు హరిహరన్ మూడుసార్లు తీసివేయబడి, మూడు సార్లూ వేతనోన్నతితో తీసుకోబడ్డాడు.

కోపం ఒక్కటి తప్పితే సదానంద్‌గారు అత్యంత దయాగుణం కలవారు. తన 19వ ఏటనే వారి కార్యదర్శిగా పనిచేసిన ఎం.ఆర్. భండార్కర్ మొట్టమొదట నిదానమే ప్రధానం అనేవాడు. పైగా అనేక తప్పులు చేసేవాడు. కాని సదానంద్‌గారు భండార్కర్ చేస్తున్న వ్యాకరణ దోషాల్ని దిద్ది తప్పులేకుండా బాగా రాయగలిగేలా ప్రోత్సహించేవారు. కొన్నేళ్ళలోనే భండార్కర్ ఎంతగా రాయగలిగాడంటే ముంబై హైకోర్టులో పని లభించి, న్యాయమూర్తి ఎం.సి. ఛాగ్లా లాంటి ఎంతోమంది న్యాయమూర్తులతో సమర్థవంతంగా పనులు నిర్వహించారు.

సదానంద్ తనని విమర్శించిన వాళ్ళ పట్ల వినయంగా ప్రవర్తించేవారు. 'బాంబే సెంటినల్' సంపాదకులు బి.బి. హర్నిమన్ సదానంద్ గారి గరించి తీవ్రమైన విమర్శా వ్యాసాలు రాసేవారు. అయినా హర్నిమన్ 'బాంబే సెంటినల్' విడిచి పెట్టాక అతనికి ఎక్కడా పని దొరక్క పోవడంతో హర్నిమన్ జీవిత చరిత్రను అనేక భాగాలుగా ముద్రించి అతనికి ఎంతగానో సేవ చేశారు.

సదానంద్‌గారి నుండి ఓ రోజు పగలు నాకు అర్జంటుగా పిలుపు వచ్చింది. ఏం తప్పు చేశానబ్బా అంటూ వారి గదిలోకి కంగారుగా అడుగు పెట్టాను. "ఇదుగో...ఇది చదువు" అంటూ నా చేతికి ఓ పత్రిక నిచ్చారు. దాన్ని విప్పాను. సంపాదకులు ఎం.వి. కామత్ అనే అచ్చయిన మాంత్రికమైన అక్షరాలు నాకేసి చూస్తున్నాయి. దీని గురించి సదానంద్ నాకు ఏమాత్రమూ ముందు సూచించలేదు. ఇది వారి పనితీరు.

సదానంద్ గారికి ఎలాంటి అలవాట్లూ లేవు. ఆటలు, సంగీతం, అంటే అంతకంతే!

పత్రిక, కుటుంబం, ఈ రెండే వారి ఆసక్తులు..వ్యాసక్తులు. కార్యాలయంలో చిన్న చిన్న విషయాల్ని కూడా అతను పట్టించుకునేవారు. రిపోర్టర్ సేతురామన్ ప్రతి రోజూ గడ్డం గీసుకోక ఆఫీసుకి రావడం చూసి గడ్డం తీసుకోవడానికి రోజూ ఓ రూపాయి యివ్వడం ప్రారంభించారు. కాని సేతురామన్ ఆ డబ్బుని గుర్రపు పందేలకి ఉపయోగించ సాగాడు. సదానంద్ గారికి విషయం తెలిసి మంగలిని పిలిపించి రోజూ సేతురామన్‌కు ఆఫీసులోనే గడ్డం గీయించమని ఆజ్ఞాపించారు.

పాఠకుల పట్ల సదానంద్ గారికి చాలా పట్టింపు, ఓసారి నేను ఒక వార్త చివరి 'అండ్ పీస్ అరైవ్స్ నాట్ విత్ ఎ బ్యాంగ్ బట్ విత్ ఎ వింపర్' అనే ఇలియట్ మాటల్ని రాశాను. ఆ మాటల అర్థమేమిటని ప్రశ్నించారు సదానంద్ అవి ఇలియట్ మాటలు అన్నాన్నేను.

"నా పాఠకుల్లో ఎంత మంది ఇలియట్ రాతలు చదివారు?" అంటూ ఆ పంక్తుల్ని కొట్టిపారేశారు.

"సామాన్య ప్రజానీకం కోసం నువ్వు రాస్తున్నావని గుర్తుంచుకో! సాహితీవేత్తల కోసం కాదు" అన్నారు. ఆ సలహాని నేను ఏనాడూ మరువలేదు.

సదానంద్ ఎవరి మార్గాన్నీ అనుసరించలేదు. గాంధీజీ గురించి వారికి గౌరవం వున్నప్పటికీ 1944 నాటికి "క్విట్ ఇండియా" ఉద్యమాన్ని మళ్ళీ లేవదీయనందుకు గాంధీ గారిని విమర్శించక వదల్లేదు. 1946లో దేశవిభజన గురించి గాంధీ-జిన్నాల రహస్య సంభాషణల్ని ప్రచురించడంతోపాటు గాంధీ గారిని బలంగా ప్రతిఘటించారు.

ఎల్లప్పుడూ తన దగ్గర పని చేసేవాళ్ళ పక్షమే వహించేవారు సదానంద్. ఓ మారు కాంగ్రెస్ పెద్ద మనిషి శ్రీనివాస్ మల్యా నా వార్తల్లో తన అభిప్రాయాలకి మద్దతిస్తూ రాయాల్సిందిగా నన్ను కోరారు. నేనలా చేయకపోవడంతో సదానంద్ గారికి తెలిపి నన్ను పనిలోంచి తీసివేయించగలనని బెదిరించారు కూడాను.

"నీకు మల్యాతెలీదా?" ఓ రోజు సదానంద్ నన్ను అడిగారు నేను తలాడించాను. "నిన్ను పనిలోంచి తీసేయమని అతను నా వెంట ఎందుకు పడ్డట్లు?" అంటూనే నేను జవాబు చెప్పేలోపే విషయం మార్చారు.

బ్రిటిష్ వాళ్ళే కానివ్వండి. భారతీయులే అవనీయండి ఎవరి నిర్బంధానికీ లొంగిపోయే రకం కాదు సదానంద్. ఓ సందర్భంలో హోం శాఖామంత్రి అయిన సర్దార్ వల్లభాయి పటేల్ కూడా సదానంద్ ప్రవర్తన చూసి అగ్గిబుగ్గయ్యారు.



సర్కార్ వారి ఆగ్రహానికి సదానంద్ ఎంతో మూల్యం చెల్లించాల్సి వచ్చింది. ఆ సమయంలో సదానంద్ అంతర్జాతీయ వార్తా ఏజన్సీ శాఖల్ని లండన్‌తోపాటు వాషింగ్టన్‌లోనూ ప్రారంభించే సన్నాహాలు చేస్తున్నారు. వాటి కోసం ఏడు లక్షల రూపాయలు అప్పటికే ఖర్చయ్యాయి. అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయి. ఇక కావల్సింది ప్రభుత్వానుమతి ఒక్కటే.

కాని సర్కారుని వ్యతిరేకించిన సదానంద్ గారికి ప్రభుత్వానుమతి దొరక్క అంతర్జాతీయ న్యూస్ ఏజన్సీకి సంబంధించిన కలలన్నీ కల్లలయ్యాయి. కాని వారు "ముందున్నది ముసళ్ళ పండగ" అన్నట్లు మరిన్ని కష్టనష్టాల పాలయ్యారు. 1951లో ప్రభుత్వం పత్రికా స్వాతంత్ర్యానికి కళ్ళెం వేసే చట్టాన్ని జారీ చేసింది. సదానంద్'గారు ఆ చట్టాన్ని నిరోధించిన వాళ్ళలో ప్రముఖులు. వారు అఖిల భారత వార్తాపత్రికా సంపాదకులు సమావేశంలో పత్రికలన్నీ సంపాదకీయపు పైభాగంలో ఓ ప్రతిఘటనా సందేశాన్ని ప్రచురించాలని చెప్పారు. చాలా పత్రికలు ఈ నిర్ణయానికి ప్రాముఖ్యం యివ్వనప్పటికీ ఫ్రీ ప్రెస్ మాత్రం "వాక్స్వాతంత్ర్యం మన జన్మహక్కు. ప్రభుత్వ యంత్రాంగంతో ఈ హక్కు మనకి పూర్తిగా లభ్యం కావడం లేదు కనుక సదానంద్ గారు కొన ఊపిరి వున్నంత వరకూ దీని కోసం పోరాడుతూనే వుంటారు' అంటూ ముద్రించింది.

1945 నుంచి 1950 వరకూ "ఫ్రీ ప్రెస్" కి స్వర్ణయుగం. ప్రతి రోజూ కార్టూన్లు, ప్రత్యేక వ్యాసాలు, క్రీడారంగం కోసం ప్రత్యేకించి ఓ పేజీ మొదలైన కొంగ్రొత్త పద్ధతులతో పాటు పత్రికని అత్యంత ఆకర్షణీయంగా తీర్చిదిద్దేవారు. "పత్రికల్లో క్రీడారంగానికీ విలువ వుందని అర్థం చేసుకున్న మొట్టమొదటి సంపాదకుడు" అని పత్రికకు క్రీడా సంపాదకుడు అయిన ఎ.ఎఫ్.ఎస్. తల్యార్‌ఖాన్ సదానందగారిని గుర్తు చేసేవారు.

దురదృష్టవశాత్తు సదానంద్‌గారికి ఆర్థిక యిబ్బందులు యిబ్బడి ముబ్బడయ్యాయి. వెలుగుచూడని అంతర్జాతీయ వార్తా ఏజెన్సీ కోసం, మద్రాసులో ఓ దేవాలయం గురించీ, బంగళా కొరకూ చాలా డబ్బులు హరించుకుపోయినై. 1951 వరకు వారి అప్పులు పెరిగిపోయినై. చాలా సార్లు న్యూస్‌ప్రింటు కొరకు డబ్బు లేకపోయేవి. మానసిక ఒత్తిళ్ళకు గురైన సదానంద్ గారి ఆరోగ్యం పాడైపోయింది. వారు మధుమేహం, బి.పి.,

ఫిలేరియాసిస్‌లతో పూర్తిగా క్షీణించారు. 1952లో గుండెపోటు వచ్చింది. దాంతో తనకివి అంతిమ క్షణాలని సదానంద్‌గారు గమనించగలిగారు. 1953 అత్యంత మనస్తాపంతో తన పత్రికని అమ్మేశారు.

చివరి సారిగా సదానంద్‌గారిని కలిసింది నేనేనాడూ మరువలేను. 'ఫ్రీ ప్రెస్' బంగళాలో కలుసుకున్నాం. నేను పై భాగంలో వున్న ఆఫీస్‌కి వెళ్తున్నాను. కిందికి దిగివస్తోన్న సదానంద్ నీరసంతో చిక్కిపోయి వున్నారు. నా నుండి తప్పించుకోవాలని చూస్తున్నారు. వారు పత్రికని అమ్మేసిన పుట్టెడు దుఃఖంలో వున్నారు. నేను అతణ్ణి అనుసరించాను. "వెళ్ళు..., నా వెంటరాకు" అని విలపించారు. తర్వాత కొన్ని రోజుల్లో ఈ లోకాన్ని వదిలివెళ్ళిపోయారు.

సదానంద్ గారితో ప్రారంభమైన పత్రికోద్యమం ఇవాల్టి వరకూ కొనసాగుతోంది. వార్తాపత్రికలు, పీరియాడికల్స్ సంఖ్య పెరిగి అత్యంత ఆకర్షణీయంగా మారాయి. సాంకేతిక జ్ఞానం కూడా పెరిగింది. కొంగ్రొత్త యంత్రాల ఆవిష్కారం జరిగింది. ఈనాడు మునుపటికన్న వార్తలు రాసే రీతి ఉత్తమోత్తమంగా మారింది. అయినప్పటికీ పత్రికోద్యమం అనేక ఒత్తిళ్ళకు గురవుతోంది. ఇవాళ్ళి పత్రికా ప్రపంచానికి మరో స్వామినాథ సదానంద గారి అవసరం ఖచ్చితంగా ఉంది.

- మూలం : ఎం.వి. కామత్

- మానేరు టైమ్స్ 28 జనవరి-5 ఫిబ్రవరి 1998



# మహిళల ఆత్మగౌరవ చిరునామా మలయాళ స్త్రీవాద కథా సాహిత్యం

మలయాళ కథాసాహిత్యం మొదటినుండీ ప్రయోగ వైచిత్రికి పెట్టింది పేరు. పంచతంత్రం, జాతక కథల్లాంటి సంప్రదాయ కథల కన్న భిన్నమైన రీతిలో 1891లోనే వచ్చిన మొదటి మలయాళ కథ 'వాసనా వికృతి'- తెలుగు 'దిద్దుబాటు'కన్న ఇరవై ఏళ్ళు ముందుగా వచ్చింది. వేంగయిల్ కుంజిరామన్ నాయర్‌తో మొదలైన ఈ కథా ప్రవాహం నూరేళ్ళు పూర్తిచేసుకుని నూతన సహస్రాబ్దిలో ప్రవేశించి అనేక పాయలతో అక్కడి మట్టిని తడుపుతోంది.

ప్రపంచవ్యాప్తంగా వచ్చిన పలురకాల ఉద్యమాలను కేరళ రాష్ట్రం స్వంతం చేసుకున్న దాని కన్న మిన్నగా, ఆ ఉద్యమాలు మొత్తానికి మొత్తంగా మలయాళ కథల్లో పరకాయ ప్రవేశం చేసి పాఠకుల్ని పరవశుల్ని కావించాయి. ఆరంభ కాలంలో 'బాలారిష్టాలు' అనుభవించిన మలయాళ కథ-ఆ తర్వాత తగళి, దేవ్, వైక్కం, పొట్టెక్కాట్ తదితరుల రంగప్రవేశంతో మూడు దశాబ్దాలు అత్యంత ఆరోగ్యకరంగా కొనసాగింది. ఈ దశలో మార్క్సిజం ప్రభావంతో రాసిన రచయితలు ఎక్కువ. పేదల బాధల్ని చూసిన కథా రచయిత లెందరో కన్నీళ్ళ పర్యంతమయ్యారు. వాళ్ళ కలాలు సిరా నీళ్ళ పర్యంతమై సామాన్యుడు మాన్యుడయ్యాడు. పొన్‌కున్నం సంఘంలోని దురాగతాల మీద దాడి చేసిన ధీరుడైన రచయిత. ఎం.టి. మాధవకుట్టి, టి. పద్మనాభన్‌లు కథా స్రవంతికి కొత్త జవజీవాలు కల్పిస్తే, ఆధునికతా ప్రభావంతో ఓ.వి. విజయన్‌లాంటి వాళ్ళు

నగరవాసుల సుఖదుఃఖాల్ని కథల ద్వారా కలబోశారు. ఆ తర్వాత వచ్చిన స్త్రీ, దళిత, ఉత్తరాధునికతా వాదాలు మలయాళ కథా లోకంలో కాలూని మలయాళీలకు సరికొత్త రుచుల్ని అందించాయి.

ఎనబయిల్లో మొదలైన స్త్రీవాద సాహిత్యానికి కుదుళ్ళు..లలితాంబిక అంతర్జనం, మాధవకుట్టి, సరస్వతి అమ్మ, ఉషా నంబ్యార్‌ల రచనల్లో కొంతమేరకు పాదుకొనివున్నాయి. అయితే అప్పట్లో ఆ రచనలకు ప్రత్యేకంగా స్త్రీవాద సాహిత్యం అన్న పేరు గానీ, ఆ రచయిత్రులకు స్త్రీ వాదులన్న ముద్రగానీ లేకుండేవి! వాళ్ళది స్త్రీ బాధ సాహిత్యం. ఆడవాళ్ళ వ్యథల్ని, కన్నీటి కథల్ని ఎంతో ఆర్ద్రంగా చిత్రీకరించిన రచయిత్రులు వాళ్ళు. లలితాంబిక అంతర్జనం రాసిన 'అగ్నిసాక్షి' నవల కాలానికి సాక్షీ భూతంగా నిలబడ్డమేగాక, తేతిక్కుట్టి అనే ప్రధాన పాత్రతో ఆనాటి నంబూద్రి స్త్రీల బాధలకు అసలు సిసలు పర్యాయంగా నిలిచింది. అతి సున్నిత మనస్తత్వమూ, భావోద్విగ్నతా కలబోసినట్లున్న తేతిక్కుట్టి...కరడు గట్టిన నంబూద్రి బ్రాహ్మల యింట సవాలక్ష భయంకర బాధల పాటల పల్లవిని ఆలపించింది. చివరకు ఆమె తన వివాహ బంధాన్ని సైతం కాదని స్వాతంత్ర్య సమరం లోకి దూకింది. సమాజ సేవకు సమాయత్తురాలైంది.

స్త్రీల సంవేదనల్ని సంచలనాత్మకంగా ప్రకటించిన మరొక మలయాళ రచయిత్రి మాధవికుట్టి. కమలాదాస్ పేరుతో ఆంగ్లంలో అనేక కవితా గ్రంథాలు రాసిన ఈమె, యిటీవలే ఇస్లాం మతాన్ని స్వీకరించి కమలా సురయ్యాగా మరో సంచలనానికి తెర తీసింది. 1984లో ఒకసారి ఈమె ఆంగ్లంలో రాసిన కవితలు నోబెల్ పురస్కార పరిశీలనార్హమయ్యాయి. 'నాకథ' అంటూ రాసిన ఆత్మకథ అనేక భాషల్లోకి అనువదించబడింది. సెక్సుకు సంబంధించిన అనేక నిషిద్ధాంశాల్ని బద్దలు కొట్టి బహిరంగం చేసిన మాధవి కుట్టి మలయాళ కథా భూమికను ప్రకంపనాలకు గురి చేసింది.

వాస్తవానికి యివాళ మలయాళంలో స్త్రీవాద సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా ముందుకు తీసుకొని వెళుతున్న రచయిత్రుల్లో సారా జోసఫ్ ముందు వరుసలో ఉంటుంది. ఆ తర్వాత గ్రేసి అనే మరో రచయిత్రి స్ఫురిస్తుంది. వీళ్ళేకాదు చంద్రమతి, అషిత, మానసి, వత్సల, ప్రియ ఏ.ఎస్. విజయలక్ష్మి, రాజ్యలక్ష్మి, (ఆత్మహత్య చేసుకుంది)



మొదలైన రచయిత్రులెందరో ఆడవాళ్ళ కంఠాన్ని కేరళలో బలంగా వినిపిస్తున్నారు. సారా జోసెఫ్ ఈ మధ్య ప్రకటించిన 'జాబిల్లికి తెలుసు' (నిలావు అఱియున్ను) కథా సంపుటిని స్త్రీ వాద సాహిత్యానికి లక్షణ గ్రంథంగా పేర్కొనవచ్చు. భాష విషయంలో కూడా ఆమెకు చాలా పట్టింపులున్నాయి. తీవ్రమైన ఆక్షేపణలున్నాయి. వేశ్య, కన్యక, సహధర్మచారిణి, పతివ్రత యిలాంటి పదజాలం మగ మద మృగాల వల్ల సృష్టించబడిందనీ తక్షణం వీటిని నిఘంటువుల్లోంచి ఊచముట్టుగా తుడిచి పెట్టాలనీ వాదిస్తోంది. వేశ్యలాంటి పదాలకు పుల్లింగాలెందుకు లేవని తీవ్రస్వరంతో ప్రశ్నిస్తోంది. స్త్రీవాద సంస్కృతినీ, ద్రావిడ ఆదివాసీల సంస్కృతుల్నీ పుద్దీపనం చేయగల్గిన పన్నెండు కథల సమాహారమే 'జాబిల్లికి తెలుసు'. ఈ సంకలనంలోని 'అశోకవనం' 'తల్లికులం' కథలు రామాయణంలోని కథా సన్నివేశాలకు కొత్త వ్యాఖ్యానాలుగా కొలువు తీరాయి.

మలయాళ కథా ప్రపంచంలో తనదైన ముద్రకల్గిన గ్రేసి యిటీవలే 15 కథలతో 'ఇద్దరు స్వప్నదర్శులు' (రండు స్వప్నదర్శిగళ్) అనే పుస్తకాన్ని అచ్చువేసింది. బతుకు ముళ్ళ కంచె లోంచి బయటికి రాలేక పెనుగులాడుతోన్న అనేక వ్యక్తుల చేదు అనుభవాల సారాన్ని గ్రేసి ఈ సంపుటిలో వడగట్టింది. ఆమె కథల్లోని ప్రతి పాత్రలో ఎక్కడో ఒకచోట ఓ రక్తనాళ సంస్పందన స్పష్టంగా వుంటుంది. ఉత్త కాలక్షేప కథలు కావవి. ఈ వ్యవస్థ తీరుతెన్నుల పట్ల తీవ్ర అసహనానికి లోనైన ఈ రచయిత్రి ఆలోచింప చేసే కథలతో పాఠకుల్ని అవలీలగా తనవెంట తీసుకొని వెళుతుంది. స్త్రీ మాంస దాహం కోసమే పుట్టినట్లున్న మగ రాయుళ్ళ వికృత ముఖాల్ని కథల్లో అనేక రకాలుగా పట్టి చూపుతుంది. ఈమె దృష్టిలో స్త్రీ కేవలం స్త్రీయే కాదు...ప్రియురాలు, భార్య, కూతురు, తల్లి...అంతే కాదు...పురుష దురహంకారాన్ని ప్రతిఘటించే సబల. ఈమెదే 'కుక్కలున్నాయి జాగ్రత్త' గొప్ప కథ. ఓ యింటి ముందు 'కుక్కలున్నాయి జాగ్రత్త' అనే బోర్డుని గమనించక ఆ యింట్లోకి వెళ్ళిన స్త్రీ, యింటి యజమాని బలాత్కారానికి గురవుతుంది. మగవాళ్ళు కుక్కలేనని పరోక్షంగా తెలియచేసిన ఈ కథలో చక్కని ధ్వని వుంది. గ్రేసి కథల్లో ప్రేమ, కరుణ, ఆర్ద్రతలు మచ్చుకైనా కన్పించవు. యథార్థ జీవిత వ్యథార్థ దృశ్యాలు కథల పొడుగూతా దర్శనమిస్తాయి. గ్రేసి తన కథల పుస్తకాలకు పేర్లు ఎంతో బాగా ఆలోచించి పెడుతుంది. గడప దాటిన పార్వతి, నరక ద్వారం, పిచ్చిపూలు...యివి గ్రేసి రాసిన యితర కథల సంపుటాల పేర్లు.

అషిత మలయాళంలో మరొక మంచి కథా రచయిత్రి. ఈమె దారి యితర రచయిత్రుల కన్న కొన్న కొంత విలక్షణమైంది. కేవలం స్త్రీవాద సాహిత్యానికి ఉపబలకమైన కథలే కాక, కేరళ సమాజంలోని యితర పార్శ్వాల మీద కూడా అషిత దృష్టి సారిస్తోంది. ఫెమినిస్ట్ 'గెట్టో'లో చేరినంత మాత్రాన ఉత్తమ స్త్రీవాద సాహిత్య సృష్టి జరుగుతుందన్న భరోసా లేదన్నది ఈమె అభిమతం. ఈ మధ్య 'మానుషి' సంపాదకురాలు మధుకిష్వర్ కూడా స్త్రీవాదం ఒక్కటే సర్వరోగ నివారిణి కాదనీ, సమస్యలకు పరిష్కారాల్ని చూపదనీ ఓ ఇంటర్వ్యూలో సచ్చిదానందన్‌తో పేర్కొనడం గమనార్హం. మరాఠీలో చాలాకాలం ఒక వూపుతో వచ్చిన దళిత సాహిత్యం యివాళ తన దృష్టిని మరింత విశాలతరం చేసుకుంటోంది. 'అషిత కథలు' (అషితయుడె కథగళ్) అనే సంపుటిని ఇటీవలే డి.సి.బుక్స్ ప్రచురించింది. ఇందులో 18 కథలున్నాయి. ఈ కథలన్నీ ఆర్ద్రంగానూ, సాంద్రంగానూ, ధ్వని నిర్భరంగానూ వుండటమే గాక 'ప్రపంచం బాధ శ్రీశ్రీకి బాధ' అన్నట్లుగా సామూహిక సమస్యలు రచయిత్రికి వైయక్తిక విభ్రాంతుల రూపంలో నిలిచాయి. అషిత కథల్లో కాఠిన్యమూ, మృదుత్వమూ పరస్పరం సంఘర్షిస్తాయి. ఎక్కడో ఓచోట దయలేని క్రూరత్వం జయించినట్లనిపించినా, సర్వత్రా సర్వదా శాశ్వత విజయం మృదుత్వానిదీ, మానవత్వానిదే నన్న ధీమా కథల్లో కన్పిస్తుంది. మూణ్ణాలుగు పేజీల్లో చక్కని ప్రణాళికతో ఒక పాత్రనో, చిన్న సంఘటననో, కించిత్ భావాన్నో, మరొక వాదాన్నో కథలకు కేంద్ర బిందువులుగా చేసుకుని గొప్పగా ముగించ గల్గుతుంది. ఈమె కథా ప్రారంభం కూడా విలక్షణంగా వుంటుంది. సహృదయ పాఠకుల్ని కథలోకి నడిపంచగల్గిన ఆకర్షణీయమైన 'ఓపెనింగ్' అషిత ప్రత్యేకత. ఈమె రాసిన ప్రతి కథా ఒక అసంపూర్ణ చిత్రంలా భాసిస్తుంది. ఒక్కో కథ ఒక్కో ప్రశ్నను మిగిల్చి వెళుతుంది. ఒక తల్లి తన కూతురుతో క్రీస్తు చేసిన మహాద్భుతాల గురించి కథలు కథలుగా వివరించి చెబుతున్నప్పుడు 'క్రీస్తు హిందువా? ముస్లిమా? అమ్మా! నువ్వు హిందువ్వా, ముస్లిమ్‌వ్వా?" అని అడిగిన చిన్నపిల్ల గౌరి, భర్త కోసం ప్రియుడితో చదరంగం ఆడి పావులు కదిపి ఓడించి గలగలా నవ్విన ఓ యిల్లాలు, పక్కింటి గయ్యాళి కుప్పమ్మ స్నానం చేస్తుంటే వింతగా చూస్తోన్న అత్యంత విశ్వసనీయ భర్తను గమనించి కొయ్యబారిన సరళ, తనకు నీతి పాఠాలు చెప్పి దయాహృదయులై వుండాలని చెప్పిన నాన్న తన కళ్ళముందు రక్త కాసారంలో విలవిలా కొట్టుకుంటోన్న పావురాన్ని



వదిలి ఉత్తమ జర్నలిస్టు అవార్డు తీసుకోవడానకి వెళుతుంటే "అన్ని నీతి ప్రవచనాలూ వుత్త కల్లబొల్లి కబుర్లే కదూ" అని ప్రశ్నించిన పదమూడేళ్ళ పాప అప్పు, తన పేయింగ్ గెస్ట్‌గా వుంటూనే అప్మ అనే అమ్మాయిని లొంగదీసుకున్న నలభైఏళ్ళ ఒక వ్యక్తి, పిచ్చాసుపత్రి నుండి తప్పించుకుని బీట్ పోలీసుల అత్యాచారానికి గురైన అన్నమ్మ, రష్యా ముక్కలు చెక్కలై ఒక శ్రామిక మహాస్వప్నం కళ్ళ ముందే కుప్ప కూలినా విప్లవ మహాప్రస్థానంలో మడమ తిప్పని మహావిప్లవ యోధుడు పద్మనాభన్...ఇలా ఒక్కటేమిటి అనేకానేక విషయాలు అషిత కథలకు మూలసామాగ్రిని అందించాయి.

త్రివేంద్రంలోని ఆల్ సెయింట్స్ కళాశాలలో ఆంగ్ల రీడర్‌గా పనిచేస్తున్న చంద్రమతి మరొక మంచి మలయాళ రచయిత్రి. ఇంగ్లీషులో కూడా ఈమె నాలుగు గ్రంథాల్ని అనేక పరిశోధనా వ్యాసాలు రాసి గుర్తింపును తెచ్చుకుంది. చంద్రమతి రాసిన "రెయిన్ డీర్" కథల సంపుటికి కేరళ సాహిత్య అకాడమీ అవార్డు లభించింది. మాసి పోని గాయాల్ని, ఆరిపోని స్మృతుల్ని చక్కని కథలుగా చెక్కగలిగిన శిల్పి ఈవిడ. ఇటీవల చంద్రమతి వెలువరించిన దేవిగ్రామం కథల పుస్తకం పదహారణాల గ్రామీణ చైతన్యానికి మంచి మచ్చుతునక. 'ఇల్లు గుల్లవుతుంది' అన్నది పాల కాలం ముచ్చట. మనం కళ్ళు మూసుకుంటే భారతదేశంలోని పల్లెలన్నీ మొత్తానికి మొత్తంగా గుల్లవుతాయి. కొల్లగొట్టబడతాయి. ఇప్పటికే నగరీకరణ వ్యామోహంలో పల్లెలు తీవ్ర నిరాదరణకు గురవుతున్నాయి. చంద్రమతికి ఆధునిక నాగరికత నచ్చదు. తెచ్చిపెట్టుకున్న నాగరికత గ్రామీణ జీవనాన్ని, గ్రామీణ సౌందర్యాన్ని సర్వనాశనం చేస్తోందన్నది రచయిత్రి అభిమతం. ఈ నేపథ్యంలోంచి వచ్చిన పల్లె మట్టి వాసనల కథల పుస్తకమే 'దేవి గ్రామం'. పట్టణంలో వుంటూనే పల్లెతనాన్ని ఏమాత్రం విస్మరించని ఓ ఆధునిక యువతీ, పల్లెలో అందరి యోగ క్షేమాలు తనవే అన్నట్లు ప్రజలందరినీ ఆదుకునే ఓ ముసలమ్మా...'దేవి గ్రామం' కథలో ప్రధాన పాత్రలు. 'దేవి గ్రామం'లోని ముసలమ్మ (ముత్తశ్శి)ను మన కట్టమంచి ముసలమ్మతో పోల్చవచ్చు. స్త్రీవాద సంకేతాలను వాడుకోకుండానే, చంద్రమతి స్త్రీల ఆంతరిక సంఘర్షణల్ని కథల్లో అద్భుతంగా ప్రతిపాదిస్తోంది. స్త్రీవాదాన్ని గుడ్డిగా అనుకరించడం గాక, భారతీయ స్త్రీవాదం వెలుతుర్లో ఈ రచయిత్రి కథల్ని పండిస్తోంది. చంద్రమతి మొదటి కథా సంకలనం పేరు 'ఆర్యా వర్తం'. భాషాపరంగా చూసినప్పుడు కాచి వడబోసిన మాటలు, మౌలికమైన ప్రయోగాలు, విలక్షణమైన కథాకథనం, పాఠకునితో అరమరికలు లేని పారదర్శకత... ఈ రచయిత్రి తన కథారచనలో సాధించిన విశేషాలు. బొత్తిగా వైవాహికం (తిగచ్చుం

వైవాహికం) ఎదురుచూస్తున్నవాళ్ళు (కాత్తిరున్నవర్) అనే కథలు 'దేవి గ్రామం' పుస్తకంలో నిలువెత్తు స్త్రీ సంవేదనలకు ప్రతిరూపాలు.

'మానసి' అనే మరో మలయాళ రచయిత్రి కథల్లో స్త్రీపరమైన ఆరాటాలు, ఆందోళనలు, ఆవేదనలు బలంగా వేళ్ళూనుకుని వున్నాయి. మానసి తన కథా కథనంలో అనవసర భావోద్విగ్నతలకు లోనవకుండా స్త్రీలను చైతన్య మూర్తుల్ని చేసేందుకు ప్రయత్నిస్తుంది. కథలకు పేరు పెట్టడంలోనూ, ఎత్తుగడలోనూ ఈ రచయిత్రి తన అవగాహనను సూచనప్రాయంగా తెలియజేస్తుంది. ఈమె కథల్లో స్త్రీ, పురుషుడు, రాత్రి, పగలూ, వాస్తవాలూ, ఊహలూ...యిలా బోలెడు ద్వంద్వాలు కన్పిస్తాయి. కానీ ఈ ద్వంద్వాల్లో చాలా సందర్భాల్లో మొదటి అంశానికే విజయం లభిస్తుంది. మానసి కథల్లో మొహం మొత్తే మూస పద్ధతులు కనిపించవు. మగవాడి చేతిలో అత్యాచారానికి గురయిన స్త్రీ గురించి కాకుండా పోరాట పటిమతో పురుషుణ్ణి నిలదీసి, నిగ్గదీసి ప్రశ్నించే అపర ఆధునిక కాళికలు ఈమె కథల్లో ముఖ్య భూమికలు పోషిస్తారు.

గత పదేళ్ళుగా కథలు రాస్తోన్న ప్రియ, ఏ.ఎస్. ఇటీవల తన కథల్ని ప్రచురించింది. సాంప్రదాయికంగా వస్తున్న పదాల్ని గాక ఈ రచయిత్రి ఉత్తరాధునికతా ప్రభావంతో కొన్ని కొత్త పదబంధాల్ని ప్రయోగించింది. కొన్ని సందర్భాల్లో మలయాళంలో సుప్రసిద్ధ కథా రచయితలైన సక్కరియ, ముకుందన్‌లను అనుకరించింది. ఏమైనా ఈమె మరింతగా కృషిచేయాల్సి వుందన్నది మలయాళ విమర్శకుల అభిప్రాయం.

"స్నేహస్పర్శ" (స్నేహస్పర్శంగళ్) అనే కథల సంపుటితో మంచి పేరు తెచ్చుకున్న రచయిత్రి కె.పి. సుధీర, స్త్రీవాద సాహిత్యాన్ని స్త్రీలే రాయడంలో ఔచిత్యం వుంది. పురుషులు సానుభూతిలో స్త్రీపరమైన సమస్యల్ని కథలుగా తీర్చిదిద్దవచ్చు. కానీ స్వానుభవంలోంచి జరిగిన సాహిత్య సృష్టి సానుభూతిలోంచి వచ్చిన సృజన కన్నా బలంగా వుంటుంది. సుధీర కథల్లో నిత్యదారిద్ర్యంలో కొట్టుమిట్టాడుతున్న స్త్రీపాత్రలు సజీవంగా నిలుస్తాయి. తక్కువ వేతనానికి దినమంతా చాకిరి చేసే స్త్రీ నౌకర్లు యజమానుల చేతుల్లో ఎన్ని అవస్థల పాలవుతారో బాగా చెప్పగలిగిన రచయిత్రి సుధీర స్త్రీల ఒంటరి జీవితాల్లోని బాధల్ని కూడా సుధీర "ప్రాణస్పర్శ", "శ్రాద్ధం" కథల్లో వ్యక్తీకరించింది. స్త్రీల శరీరాలతో వ్యాపారం చేస్తోన్న దుర్మార్గ పద్ధతులకు దర్పణం ఆమె రాసిన "దేవపుట్టి" కథ సుధీర కథలు పాఠకుల్ని కదిలించివేస్తాయి. ఇంకా వత్సల, గీతా హిరణ్యన్ మొదలైన రచయిత్రులు స్త్రీల జీవితాల్లోని చీకటి పార్శ్వాల్ని, దాచేస్తే



దాగని నిజాల్ని సమర్థవంతంగా ఆవిష్కరిస్తున్నారు. ఎనబయిల్లో మొదలైన మలయాళ స్త్రీవాద కథాసాహిత్యం నిరాఘాటంగా ముందుకు కదులుతోంది. స్త్రీ పరమైన రాజకీయ, లైంగిక, ఆర్థిక, సామాజిక సమస్యల పట్ల తీవ్రంగా స్పందిస్తోంది. ఆధునిక మలయాళ సాహిత్యంలో ఒక గుర్తింపును తెచ్చుకుంది. మహిళల ఆత్మగౌరవ సాహిత్యంగా మలయాళ భాషా సాహిత్యాల్ని ఒక మలుపు తిప్పింది.

-వార్త (ఆదివారం) 29, అక్టోబరు 2000

# రెండు దేశాలు-కథ ఒక్కటే!

*(అది దేశవిభజన సమయం. హైదరాబాదు రాష్ట్రంగా అయితే పాకిస్తాన్‌లో కలిసిపోతుందనో, లేదా స్వతంత్ర రాజ్యంగా ఉంటుందనో హైదరాబాద్ రాష్ట్రంలోని ముస్లింల అవగాహన. కానీ అలా జరగలేదు. ఉర్దూలో సుప్రసిద్ధ జర్నలిస్టూ, రచయితా అయిన ఇబ్రహీం జలీస్‌కు హైదరాబాద్ రాష్ట్ర రజాకార్ల ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధాలు ఉండేవి. ఇప్పుడాయన పాకిస్తాన్‌లో ఉంటున్నారు. పోలీస్ యాక్షన్, హైదరాబాద్ అల్లర్ల నేపథ్యంతో ఆయన అప్పట్లో 'దో ముల్క్-ఏక్ కహానీ' గ్రంథం రాశాడు. ఇప్పుడది అలభ్యం. ఈ తరంవాళ్లకు ఆ పుస్తకంతో పరిచయం కూడా లేదు. అందువల్ల ఆ గ్రంథంలోని కొన్ని భాగాలను అనువదించడం జరిగింది. అప్పట్లో ముస్లింల ఆలోచనా విధానం, రాజకీయ అవగాహన, మత దృక్పథం ఎలా ఉండేవో దీనిద్వారా కొంతవరకూ తెలుసుకునే అవకాశం ఉంది.)*

ఆబిడ్స్ రోడ్డు కొత్త పెళ్ళికూతురిలాగా ముస్తాబయ్యింది. బషీర్‌బాగ్ నుండి జనరల్ పోస్టాఫీస్ వరకు రంగురంగుల వేలాది విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నది.

ఆ రోజు 14వ ఆగస్ట్ 1947 14వ ఆగస్టు ప్రతి ఏడూ వస్తూనే ఉంటుంది. కానీ అది ప్రతిసారీ గాఢాంధకారంలో మునిగిపోయేది! అన్ని దినాల్లాగే మామూలుగా గడిచిపోయేది! కానీ 1947లో పురుడుపోసుకున్న 14 ఆగస్ట్ ఒక సర్వస్వతంత్ర భారత దేశ చరిత్రలో మొదటిపేజీగా మారిపోనున్నది.

వెలిగిపోతున్న రోడ్లమీద ఎటుచూసినా గుంపులు గుంపులుగా ప్రజలు, దాస్యశృంఖలాల్లో మగ్గిపోయిన దేశం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవిస్తుంటే చూసి



తరించిపోతున్నారు. అంతా బాగానే ఉంది. ఇంతవరకు అంతా బాగానే వుంది. అయితే...'హిందుస్థాన్ ఆజాద్ హువా, పాకిస్థాన్ వజూద్ మే (ఉనికిలోకి) ఆయా, ఔర్ హైదరాబాద్?..' పెద్ద సవాలుగా మారింది. ఆబిడ్స్ రోడ్డుమీద 'ఆజాద్ హైదరాబాద్ జిందాబాద్', 'హిజ్ మెజెస్టీ షాహ్ ఉస్మాన్ జిందాబాద్' లాంటి నినాదాల హోరుతో హైదరాబాదు దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. హైదరాబాదు స్టేట్ కూడా సర్వస్వతంత్ర దేశంగా మారిపోయింది. ఎందుకంటే, హిజ్ మెజెస్టీ జార్జ్-6 హైదరాబాద్ స్టేట్‌ను స్వతంత్రదేశంగా ప్రకటించాడు. దక్కన్ రేడియో ద్వారా ఇబ్రహీమ్ జలీస్ (ఈ వ్యాసకర్త) ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తున్నాడు. హైదరాబాద్ ముస్లింలు చాలా ఖుషీ ఖుషీగా ఉన్నారు. హిందువులు మాత్రం భారతదేశం నుండి హైదరాబాద్ విడిగా ఎందుకుండాలో అని విచారకరంగా ఉన్నారు. ఉస్మాన్ (ఏడవ నిజాం) ను గద్దెమీద అలాగే ఉంచడానికి లండన్‌లో మాంచెస్టర్ గార్డియన్ అనే పత్రిక ఒక వ్యాసం ప్రచురించింది. విన్‌స్టన్ చర్చిల్ పార్లమెంటులో హైదరాబాద్ స్వాతంత్ర్యానికి మద్దతు ప్రకటించాడు.

18 ఆగస్టు నాటి రహబరే-దక్కన్ లాంటి స్థానిక దినపత్రికల్లో మొదటి పేజీలో నిజాంనవాబు ఇలా ప్రకటించాడు. 'అల్లా దయవల్ల హైదరాబాదు ఇప్పుడు సర్వస్వతంత్రదేశంగా మారిపోయింది. నేను ఈ దేశాన్ని అటు హిందూస్థాన్‌లో గానీ, ఇటు పాకిస్థాన్‌లో గానీ విలీనం చేయడం లేదు. అయితే ఆ రెండు దేశాలతో మన గౌరవానికి భంగం కలగని రీతిలో సత్సంబంధాలు మాత్రం పెట్టుకుంటాను'. కానీ, నిజాం పాలనలో ఉన్న ప్రజలు మట్టుకు మానసికంగా హైదరాబాదును రెండు ముక్కలుగా విభజించుకున్నారు. రాష్ట్రంలో ఉన్న 25 లక్షల ముసల్మానులు తాము పాకిస్తాన్‌లో చేరిపోయినట్టు భావించేవారు. ఇక ఒక కోటీ 50 లక్షల మంది హిందువులు తాము హిందూస్థాన్‌లో ఉండిపోయినట్లు అనుకునేవారు. హైదరాబాద్ అమాంతం దక్కన్ పాకిస్తాన్‌గా మారిపోయింది. కొంతమంది స్థానిక వ్యాపారులయితే ఏకంగా తమ దుకాణాలకు సంబంధించిన ప్రకటనలను పత్రికల్లో ఇలా ప్రకటించేసుకున్నారు కూడా. 'దక్కన్ పాకిస్థాన్ కీ సారీ చీజోంకే లియే హమారీ ఖద్మాత్ (సేవలు) హాసిల్ కీజియే'-హాజీ దాదా జనరల్ మర్చంట్స్, పత్తర్‌గట్టీ, హైదరాబాద్.

క్రమంగా మజ్లిస్ ఇత్తేహాదుల్ ముసల్మీన్ ఆధ్వర్యంలో ముసల్మానుల ప్రైవేటు సైన్యం తయారయ్యింది. దాని నాయకుడు ఖాసిం రజ్వీ, నిజాం నవాబు ఎప్పుడూ

నల్లమందుతో జోగేవాడు. ఫారసీ కవిత్వం రాసుకునేవాడు. ప్రతి సాయంత్రం తన తల్లి సమాధి దగ్గర ప్రార్థన చేసేవాడు. కొన్ని ఫర్మానాలు జారీచేసేవాడు. కాని వాటి అమలు గురించి పెద్దగా పట్టించుకునేవాడు కాదు. రాష్ట్రంలో వాస్తవాధికారం ఖాసీం రజ్వీ చేతుల్లో ఉండేదని చెప్పుకోవచ్చు.

ఒకవైపు ఢిల్లీ కల్లోలితంగా మారిపోయింది. మరొకవైపు లాహోర్, అమృత్‌సర్‌లు నిలువెత్తుమంటల్లో మాడి మసైపోతున్నాయి. అయితే హైదరాబాద్ మాత్రం ఎలాంటి అల్లర్లూ లేకుండా స్వర్గధామంగా ఉన్నది. హిందుస్తాన్, పాకిస్తాన్.. ఉభయదేశాల్లోని మతకలహాల తీవ్రత ఎంతగా ఉందంటే మానవత్వం మరో దిక్కులేక మరణ శయ్యపై ఉండి చితికి తరలిపోతున్నది. అయితే అక్కడి మత కల్లోలాల గురించి హైదరాబాదీయులకు ఒక పార్శ్వం మాత్రమే కనబడుతున్నది. కారణం...అక్కడి వార్తల కొరకు మేము రహబరే-దక్కన్, మీజాన్, వక్త్ ఔర్ నిజాం గజిట్ మొదలైన స్థానిక పత్రికలపైనే ఆధారపడవలసి రావడం. ఈ మూడు పత్రికలూ కరడుగట్టిన మతఛాందసులవి. పైగా అత్యంత సంపన్న వర్గాలవి. ఈ పత్రికల్లో ఎప్పుడూ ఢిల్లీలో ఎంతమంది ముస్లింలను చంపారో, అమృత్‌సర్‌లో ఎంతమంది ముస్లిం స్త్రీలను నగ్నంగా ఊరేగింపులు తీశారో, పాటియాలా లాంటి నగరాల్లో ఎందరు ముస్లింలు అమరులయ్యారో, తూర్పు పంజాబులో ఎంతమంది ముస్లింలను ఊచకోత కోశారో...ఇలాంటివార్తలే దర్శనమిచ్చేవి. వీటిని ప్రచురించడం వల్ల ఆ పత్రికల అమ్మకాలు విపరీతంగా పెరిగిపోయాయి. అంతేగాక హైదరాబాదు ముస్లింల నరనరాల్లో మతఛాందసవాద విషాన్ని నింపుతుండేవి. ఈ పత్రికల ఎడిటర్లయిన మహమ్మద్ వహీదుద్దీన్, అబ్దుల్‌రహమాన్ రయీస్, గులామ్ మహమ్మద్ కలకత్తా మొదలైన వారు లక్షలాది రూపాయల సొమ్ము సంపాదించారు. ఈ పత్రికలు హైదరాబాద్ ముస్లింల ముందు ఉత్తరభారతంలోని హిందువులు, సిక్కులను రాక్షసులుగానూ, పరమదుర్మార్గులుగానూ చిత్రీకరించేవి. మానవత్వంమీద అంచంచల విశ్వాసం ఉన్న ఎందరెందరో ముస్లిం మేధావులను సైతం ఈ పత్రికలు అమాంతం ఛాందసవాదులుగా మార్చాయి. అలా మార్చబడిన వాళ్లలో ఈ వ్యాసకర్త ఇబ్రహీమ్ జలీస్ కూడా ఒకడు. నేను ఏకాయెకి ముస్లిమునై పోయాను. గజనీ కా ముసల్మాన్. తారిక్ కా ముసల్మాన్. సాదిక్ హుస్సేన్, అబ్దుల్ హలీమ్ 'శరర్' నవలల్లోని ముసల్మాన్.



ఇంకేం? నేను 'అంజుమన్ తరక్కీపసంద్ ముసన్నఫీన్' (అరసం?) నుండి బైటపడ్డాను. కమ్యూనిస్టు పార్టీ నుండి దారూసలామ్ కొచ్చేశాను. అక్కడ రజ్వీ ప్రసంగం ఇలా సాగుతున్నది.

'ఓ నా ప్రియమైన ముస్లిములారా! మీరు ఖాలిద్ లేదా టిప్పుల వారసులు కండి. జమాలుద్దీన్ అఫ్ఘానీ నేత్రాల్లా మారండి. మీరు ఇక్బాల్ కవిత్వంలోకి పక్షుల్లా మారిపోండి. జిన్నా అనుంగుపుత్రులు కండి. లెండి. ఢిల్లీవైపు కదులుతూ విగ్రహాలను విధ్వంసం చేయండి. ఫతే-మక్కా మీ పాదాలను ముద్దుల్తో ముంచెత్తడానికి ఎదురుచూస్తున్నది. ఏ గజనీలాంటి ప్రాక్తనుల పాదముద్రలతో ఈ నేల పరవశించిందో, ఆ మహనీయుల అడుగుజాడల్లో నడవండి'.

నా అణువణువులో ముజాహిద్‌ల ఉద్విగ్నత చిందులు తొక్కుతున్నది. నేను వందలాది వ్యాసాలను పత్రికల్లో ప్రకటించాను. లక్షలాది ముసల్మానుల మెదళ్లలో విషం నింపాను. ప్రజలెంతగా పిచ్చివాళ్ళయిపోయారంటే, నేను గంటల తరబడి ఉపన్యాసం ఇచ్చినా అలా మంత్రముగ్ధుల్లా నిలబడి వినేవాళ్ళు. ఇబ్రహీమ్ జలీస్ జిందాబాద్ అంటూ నినాదాలు ఇచ్చేవాళ్ళు. నా వ్యాసం పత్రికల్లో వస్తుందంటే చాలు ఎగబడి కొనే వాళ్ళు. ముసల్మాన్ స్త్రీలు 'జలీస్ వ్యాసం ఈ సంచికలో ఉందా?' అని అడిగి మరీ తీసుకునేవారు. అయితే, నాలో వచ్చిన ఈ మార్పు మా ఇంట్లో ఎవరికీ నచ్చలేదు. ముఖ్యంగా మా తండ్రికి నా వ్యాసాలు నచ్చలేదు. అసలాయన నాతో మాట్లాడ్డమే మానివేశాడు. మా పెద్దన్నయ్య మహబూబ్ హుస్సేన్, తదితరులు ఈ మార్గం వదలమని ఎన్నోసార్లు హెచ్చరించారు. నేను వింటే కదా! నా దగ్గరి మిత్రులు నజీర్ హైదరాబాద్, సాహిక్ సిద్ధికీ లాంటివాళ్ళు అభ్యుదయ రచయిత సంఘం(?)లో ఉండేవాళ్ళు. వాళ్ళను కూడా మెల్లగా నా వైపు తిప్పుకున్నాను. ఇప్పుడు నా స్వప్నం ఏమిటంటే, 'అంజుమన్ తరక్కీపసంద్ ముసన్నఫీన్'కు సమాంతరంగా ముస్లిం రచయితల సంఘం స్థాపించాలని. అది ముస్లీమ్ ఇత్తేహాదుల్ ముసల్‌మీన్ ఆధ్వర్యంలో నడవాలనుకున్నాను. చివరికి మజ్లిస్ వాళ్ళు ఒక చక్కని గదిని ముస్లిం రచయితల సంఘం కార్యాలయం కొరకు ఏర్పాటు చేశారు. అక్కడ నా మిత్రులంతా చేరి పేకాట, క్యారమ్ మొదలైన ఆటలతో కాలక్షేపం చేసేవారు. ఆ రోజుల్లో ప్రొఫెసర్ అజీజ్ అహమ్మద్ పాకిస్తాన్, కాశ్మీర్‌ల పర్యటన పూర్తిచేసుకుని హైదరాబాదు తిరిగివచ్చాడు.

పాకిస్తాన్‌లో ఉన్న యువ రచయితలందరూ మిమ్మల్ని అభినందిస్తున్నారని మమ్మల్ని పొగడ్తలతో ముంచెత్తాడు. పాకిస్తాన్‌లోని ఫైజ్ అహ్మమ్మద్ ఫైజ్, సాదత్ హసన్ మంటో, మహమ్మద్ అసద్ అష్రఫ్ డా॥ మహమ్మద్ దీన్ రాసిర్ లాంటి వాళ్ళంతా మన వెంటే వున్నారని చెప్పాడు. మేమంతా సంతోషించాం. మేము భౌతికంగా హైదరాబాదులో వున్నా, మానసికంగా పాకిస్తాన్‌కు దగ్గరైపోయాం. మాకు హిందూస్థాన్‌మీద రోత కలుగుతున్నది. మా రచయితల సంఘానికి ఆ తర్వాత ఒక రేడియో సెట్టు కూడా లభించింది. అందులో పాకిస్తాన్ మీటర్ రావడానికని రేడియో ఘర్‌కు వెళ్లాం. ఆ రోజుల్లో ఈ రేడియోఘర్ అనే దుకాణం రేడియోలను రిపేరు చేయడంతోపాటు అవసరమైన వారికి పాకిస్తాన్ మీటర్ కూడా ఏర్పాటు చేసేది. బొచ్చెడు పైసలు సంపాదిస్తూ వుండేది. మేము పాకిస్తాన్ వార్తలు ఠంచన్‌గా వినే వాళ్ళం. మేమే కాదు, హైదరాబాదీ ముస్లింలంతా ప్రతిరాత్రి 9 గంటలకు హోటళ్ళ లోని రేడియోల చుట్టూ, ఇళ్ళలోని రేడియోల దగ్గరా పాకిస్తాన్ వార్తలు వినేవాళ్ళు. సరిగ్గా తొమ్మిదింబావుకి పాకిస్తాన్ నుండి ఇలా వినచ్చేది. 'అబ్ ఆప్ శకీల్ అహమ్మద్ కీ జబానీ ఉర్దూమే ఖబర్ సునియే', ఇట్లా అనగానే హైదరాబాదు ముస్లింలు ఆయన్ని షేర్ అనే వాళ్ళు. పాకిస్తాన్ రేడియో అనౌన్సర్ శకీల్ అహమ్మద్ అంటే వాళ్ళకు అంత ఇష్టం.

హైదరాబాద్ స్టేట్ స్వాతంత్ర్యాన్ని యథాతథంగా ఉంచాలని యూరప్, అమెరికాల్లో చాలా సానుభూతి ప్రకటించబడింది. అసలు కారణం అందరికళ్ళూ హైదరాబాదులో ఉన్న అపారమైన సంపదమీద ఉండడం. అందువల్లే సిడ్నీ కార్టన్ కూడా హైదరాబాద్ స్టేట్ సర్వస్వతంత్రంగా ఉండాలని అభిలషించడం. అతను అప్పట్లో ప్రపంచంలోనే నంబర్‌వన్ పైలట్. అతగాడు తన విమానాన్ని, హైదరాబాద్‌వైపు తిప్పడమేగాక అవసరమైన ఆయుధాలను కూడా అందించగలనన్నాడు. సిడ్నీకార్టన్ ఖతర్ నాక్‌పైలట్, లైసెన్సు లేకుండానే హిందూస్థానీ ఆకాశంలోకి వచ్చేవాడు. హైదరాబాద్‌కు ఆయుధాలు చేరవేసేవాడు. హిందూస్థానీ వాయుసేన ఎప్పుడూ ఆయన్ని వెన్నంటి ఉండేది. అయినా ఎలాగోలా కళ్ళుగప్పి ఆయుధాలు అందించేవాడు.

'మజ్లిస్ ఇత్తేహాద్"లో చేరిన చిన్నాచితకా లీడర్లు ఆయుధాలను దొంగచాటుగా అమ్ముకునేవాళ్ళు. చూస్తూ చూస్తూండగానే బోలెడు పైసలు సంపాదించారు. ఇళ్ళు కట్టుకున్నారు. నేను స్వయానా ఒక స్టెన్‌గన్‌ను ఇత్తెహాద్‌లోని ఒక బాధ్యతగల



లీడర్‌నుండి..ఆయన పేరెందుకు లెండి...పన్నెండొందల యాభై రూపాయలకు కొన్నాను. కానీ, నాకు ఆ తర్వాత తెలిసిందేమిటంటే, నేను ఖాసీం రజ్వీగారిని కలిసినట్లయితే అది నాకు రెండొందల యాభైకే దొరికేదట. ఇత్తెహాద్‌లో ఉన్నవాళ్ళలో దాదాపు ముప్పాతికశాతం మంది తమతమ ఆయుధాలను ఇలా దొంగచాటుగా అమ్ముకున్నారు. ఒక్కముక్కలో చెప్పాలంటే అప్పట్లో మతం అంటే ధనార్జన, మతం అంటే బతుకనే ఖాళీ పాత్రలో డబ్బులు నింపుకోవడం. అసలు నిజమైన ముసల్మాన్లు ఎవ్వరూ లేకుండిరి. పేరుకు మాత్రం 35 లక్షల మంది ఉన్నారు. పోట్లాడుతూ, కొట్లాడుతూ, లూటీలు చేస్తూ గూండాలుగా మారుతూ..ముసల్మాన్లు రజాకార్లు.

క్రమంగా హైదరాబాదులో యుద్ధసన్నాహాలు మొదలైనాయి. హిందూస్థాన్‌లో ఉన్న వాళ్ళందరి దృష్టీ హైదరాబాదు మీదే కేంద్రీకృతమై ఉంది. సర్దార్‌పటేల్ హైదరాబాద్ ఇండియాలో కణితిలా పెరిగిపోతోంది' అన్నాడు కోపంగా. 'ఈ కణితి ఇండియా పాలిట మృత్యువుగా మారబోతోంది' అని ఖాసీం రజ్వీ జవాబిచ్చేవారు. 'త్వరలోనే మేము హైదరాబాద్‌ను వశం చేసుకుంటాము' అని పండిట్ నెహ్రూ ధీమాగా అనేవాడు. 'మేము లాల్‌కిలా మీద అసఫ్‌జాహీల జెండా ఎగరవేస్తాము' అన్నది రజ్వీ సమాధానం.

హైదరాబాదుకు దేశంలోని ఇతర ప్రాంతాలనుండి సూది మొదలుకొని ఏ ఇతర వస్తువూ రాకుండా ఆర్థికపరమైన ఆంక్షలు విధించారు. ఆర్థికపరమైన ఆంక్షల ప్రభావం నిధానంగా బోధపడటం ప్రారంభమైంది. నేనొకసారి సికిందరాబాదులోని జమామసీదు దగ్గరున్న సెలూన్‌లోకి షేవింగ్‌కోసం వెళితే, షాపువాడు 'సాబ్! షేవింగ్‌సామాన్లు ఏవీ లేవు!" అన్నాడు. అక్కణ్ణుంచి రాణీగంజ్‌కొచ్చి ఎదురుగా ఉన్న దుకాణంలో కేప్‌స్టన్ సిగరెట్ కొనుక్కుందామని వెళ్ళాను. షాపువాడు కేప్‌స్టన్ లేదన్నాడు. గోల్డ్‌ఫ్లేక్, విల్స్, పాస్సింగ్, సిజర్స్...ఏవీ లేవు. చివరకు చార్‌మినార్‌తో సరిపెట్టుకోవలసివచ్చింది. దాని ధర కూడా చారాన (పావలా). నిజానికది మూడుపైసలకు ఓ ప్యాకెట్. కాలం ఎలా మారిపోయింది? ఆర్థిక ఆంక్షల విధింపుతో ధరలు మండిపోతున్నాయి. దీన్ని ఆసరాగా చేసుకుని హైదరాబాదు వ్యాపారులు, దుకాణదారులు పెట్టుబడిదారులు ప్రజల్ని కొల్లగొట్టడం ప్రారంభించారు. నా మిత్రుల కార్లు పెట్రోలు దొరక్క గ్యారేజుల్లోనే తలదాచుకున్నాయి. పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నవారు సైతం సైకిళ్ళను ఆశ్రయించక తప్పని పరిస్థితి. ఇంతలో ఈద్ పండగొచ్చింది. కొత్త దుస్తుల తళతళలు ఎక్కడా లేవు.

కారణం బట్టలు బంద్. అయితే, ప్రజలు పాత దుస్తులే ధరించి పండుగ చేసుకున్నారు. పైగా, హైదరాబాద్ స్టేట్ స్వాతంత్ర్యం కోసం త్యాగమే పెద్ద పండుగతో సమానమని సగర్వంగా భావించారు.

ఆ రోజు రాత్రి నేనొక దుర్వార్త విన్నాను. రాత్రి పది గంటల 25 నిముషాలకు జిన్నా పరమపదించాడని పాకిస్తాన్ రేడియో తెలిపింది. నాలో నిస్సత్తువ ప్రవేశించింది. ఏదో చెడు జరగబోతున్నదని నా మనసు కీడు శంకిస్తున్నది. జిన్నా మరణవార్త నుంచి హైదరాబాద్ ముస్లింలు ఇంకా తేరుకునే లేదు. 'భారతసైన్యాలు తమ మొదటిదాడిని వరంగల్ పట్టణం మీద విజయవంతంగా పూర్తిచేశాయి' అని హిందుస్థాన్ రేడియో ప్రకటించింది. ఈ వార్త హైదరాబాదును సంచలనానికి గురి చేసింది. కోపానికి తెరతీసింది. అటు జిన్నా కన్నుమూత, ఇటు భారతసైన్యాల మెరుపు దాడులు, మేము విజయమో, వీరస్వర్గమో తేల్చుకోవాలని అనుకున్నాము. నేను నేరుగా దారుసలామ్ చేరుకున్నాను. అక్కడ ఖాసీం రజ్వీతో పాటు నజర్ హైద్రాబాద్, ఖ్వాజా మొయిదుద్దీన్లు ఉన్నారు. ముజాయిదే-ఆజమ్ అయిన రజ్వీ సాయుధుడై ఉన్నా, ఆయన మొహంలో విషాద మేఘాలు దట్టంగా ఉన్నాయి. దారుసలామ్ గ్రౌండు అంతా ప్రభుత్వ వాహనాలతో, బస్సులతో నిండిపోయి ఉంది. వాటి మీద భారతసైన్యాలకు ఆచూకీ తెలియకుండా ఉండేదుకూ, పై నుండి విమానాల్లోంచి శత్రువులు చూస్తే అదంతా ఏదో ఒక అడవిలా కనిపించేందుకూ చెట్ల కొమ్మలతో కప్పారు. ఆ వాహనాల నిండా రజాకార్లు ఉన్నారు. అమీ తుమీ తేల్చుకోవడానికి తయారైవున్నారు. నేనేమో వాళ్లలో పరాక్రమాగ్నిని రగిల్చడానికీ, రణోత్సాహాన్ని కలిగించడానికీ కలాలు నూరుతున్నాను. ఇక్బాల్ కవిత్వ చరణాలను రేడియో ప్రసంగం ద్వారా వినిపిస్తున్నాను. ఆయా జిల్లాల నుండి పలు రకాల వార్తలు వస్తున్నాయి. వరంగల్ భారత సైన్యాలకు వశమైపోయిందట! బీదర్లో ఏ ఒక్క ముస్లిమూ బతికి బయట పడలేదట. ఉస్మానాబాదులో నిరాఘాటంగా హత్యాకాండ కొనసాగుతున్నదట. నా గుండె గుభిల్లుమంది. మా తండ్రితో పాటు చాలామంది బంధువులు ఉస్మానాబాదులో ఉన్నారు. వారి బాగోగులు తెలియడం లేదు. ఆలోగా మరో రెండు రోజులు గడిచిపోయాయి.

బీదర్ తర్వాత గుల్బార్గా బర్బాద్ అయిపోయింది. ఒకనాడు నేను ఇంటికి వెళ్ళేసరికి మా ఇంట్లో ఇసకవేస్తే రాలనంతమంది ఉన్నారు. విషయం ఏమిటంటే, మా అత్తగారు



మొదలైన చుట్టాలంతా గుల్బార్గ నుండి కట్టుబట్టలతో పారిపోయివచ్చారు. కానీ మా తల్లిదండ్రుల విషయం మాత్రం ఇంకా తేలలేదు. ఉస్మానాబాద్లో ఉన్న మా తండ్రి గారి దోస్తు ఒకాయన మా వాళ్ళందరినీ కాపాడాడని ఆ తర్వాత తెలిసింది. అయితే, ఆ దోస్తు హిందువట. నేను దిగ్గున సిగ్గుతో తల దించుకున్నాను. నా కళ్ళముందు మా తండ్రిగారితో పాటు ఆ హిందూదోస్తు కూడా నిలువెత్తు నిలుచున్నట్టు ఫీలయ్యాను. కానీ చించోలి తాలూకాలో మా మామగారిని తీవ్రంగా హింసించి చంపివేశారని తెలిసి ఆవేశంతో ఊగిపోయాను. మామగారి ఏకైక కుమారుడు ఏడ్పులూ, పెడబొబ్బలతో మా ఇల్లు చేరాడు. మా ఇల్లు ఒక శరణార్థుల శిబిరంగా మారిపోయింది.

యుద్ధం కొనసాగుతూనే ఉన్నది. గంటగంటకూ యుద్ధవార్తలు తెలుస్తున్నాయి. ఎంతోమంది రజాకార్లు అమరులవుతున్నారు. హైదరాబాద్ సైన్యాలు తెల్లమొకాలు వేస్తున్నాయి. వెనుకంజవేస్తున్నాయి. ఇండియన్ మిలటరీ ట్రక్కులతో, లారీలతో వీధుల్లోంచి సాగుతున్నది. వరంగల్, ఉస్మానాబాద్, బీదర్, మహబూబ్నగర్..అన్నీ పోయాయి. రాయచూర్ కూడా పోయింది. ఖాసీం రజ్వీగారికి కోపమొచ్చింది. ఆయన గారు కమాండర్ ఇద్రూస్మీద కోపాన్ని వెళ్ళగక్కాడు. వాడేదో జవాబిచ్చాడు. రజ్వీకి సంతృప్తి కలిగింది. నేను భయపడుతూనే 'రజ్వీసాబ్! నాకు ఈ కమాండర్ మాటల మీద నమ్మకం పోయింది. వాడిమీద అనుమానంగా ఉంది' అన్నాను. ఆయనేమో 'నీకేం తెలుసు. నువ్వు రాసుకునేవాడివి. వెళ్ళు. రాసుకో ఫో! అన్నాడు. హైదరాబాద్ రేడియోమాత్రం వరంగల్, నాందేడ్, పర్భణిలాంటి పట్టణాలు ఇంకా కబ్జా కాలేదని అబద్ధాలు పలుకుతోంది. హైదరాబాదు ముస్లింల నైతిక ధైర్యం దెబ్బతినకూడదని ప్రభుత్వ ప్రయత్నం. కానీ వాస్తవ పరిస్థితులు మాత్రం వేరు. వరంగల్లాంటి జిల్లాలు ఎప్పుడో వశమైపోయినై. ఒక్క మెదక్, హైదరాబాద్ మిగిలివున్నాయి. పాకిస్థాన్ రేడియో వార్తలు రావడం లేదు.

అసలు ఈ పోలీస్ యాక్షన్కు ముందురోజు నేను రజ్వీగారి దగ్గర కూచుని ఉండగా, కరీంనగర్జిల్లా అధ్యక్షుడూ, రజాకార్ల నాయకుడూ పరిగెత్తుకొచ్చి 'కరీంనగర్ సర్వనాశనమైపోయింది. రజాకార్లు అడవుల్లో దాక్కునివున్నారు. వాళ్ళని వాపస్ తెప్పించడానికి మోటార్లు, బస్సులూ పంపించండి' అన్నాడు. రజ్వీగారు వెంటనే రజాకార్ల రాష్ట్ర నాయకుడు బషీర్ అహమ్మద్ను పిలిపించి 'కరీంనగర్కు పదిలారీలు, బస్సులూ

పంపించు' అన్నాడు. వాడు వెంటనే 'నేను అన్ని ఏర్పాట్లూ చేశాను. రజాకార్లు రైళ్ళలో వస్తున్నారు' అన్నాడు. రజ్వీగారు కోపంతో ఇంతెత్తున లేచి పేపర్‌వెయిట్‌ను గోడకు విసిరికొడుతూ 'నువ్వు రజాకార్ల చీఫ్‌వి ఎట్లా అయినావు? అసలు కరీంనగర్‌లో రైల్వే స్టేషన్ ఉందా?' అని అరిచాడు. నా జబ్బలు జారిపోయినై. ఆశలు నీరుగారి పోయాయి. అది సర్వస్వతంత్ర హైదరాబాదుకు చివరి రాత్రి. పర్యవసానం.. హైదరాబాదుకు చుట్టూ ఎటుచూసినా భారతసైన్యాలు. ఆది సెప్టెంబర్ 17వ తేదీ. ఏడవ నిజాం హైదరాబాదును ఇండియాలో విలీనం చేశాడు.

*మూలం : ఇబ్రహీం జిలీస్*

*- ఆంధ్రజ్యోతి (వివిధ) 19-09-2005*